ఆంధ్ర సచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
[1938—1972]

శుక్రవారం : 27–11–'81
దుర్మతినామ సం॥ మార్గశిర శు పాడ్యమి
**సంపుటము 75 : సంచిక 12**

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు 67–60
ఆరు మాసాల చందా రు 33–80
విడిప్రతి వెల రు. 1-25 పైసలు

**ఆంధ్రపత్రిక కార్యాలయము**
గాంధీనగరం, విజయవాడ–520 003

## విషయానుక్రమణిక

## దీపావళి సంచిక

శంకుగారి కార్టూన్ ముఖచిత్రంతో వెలువడిన దీపావళి సంచిక ఆంధ్రసచిత్ర వారపత్రిక మా ఇంటిల్లిపాదినీ ఆకర్షించినది.

దీపావళి సందర్భంగా వేసిన కార్టూన్లు కడుపుబ్బ నవ్వించాయి.

సినిమా పేజీలో బి. వి. బి. గారు ఆరోజుల్లో వాక్చిత్రాలస్వర్ణోత్సవం గుర్తించి,అనాటి చిత్రపరిశ్రమ విశేషాలను కళ్లకు కట్టినట్లు తెలిపారు.

లక్కరాజు ప్రఫుల్లచంద్ర, రామశకుంతల [ధర్మవరం]

* * *

30-10-81 సంచికతో ఇంత కాలం మమ్మల్ని అలరించిన నర్సింగ్‌హోం పూర్తయింది. విశ్వం, శేఖర్‌ల పాత్ర పోషణ 'నభూతో నభవిష్యతి'' అన్నట్లుగా ఉంది. శ్రీరంగంగారికి నా అభినందనలు

భమిడిపల్లి వెంకటభాస్కర సత్యనారాయణమూర్తి [చెయ్యేరులంక]

* * *

'నర్సింగ్‌హోం' సీరియల్ చదివిన తర్వాత ఉత్తరం వ్రాయకుండా ఉండలేక పోయాను. రచయిత శ్రీరంగంగారికి నా హృదయపూర్వక అభినందనలు. ముగింపు పూహించని విధంగా జరిగింది ప్రారంభం నుంచి, అయిపోయేదాకా చాలా సస్పెన్స్‌లో జరిగింది అప్పుడే అయిపోయిందా అనిపించింది.

సి రవీంద్రకుమార్ [ విజయవాడ]

* * *

30-10-81వ తేదీ పత్రికముఖచిత్రం బావుంది. నర్సింగ్‌హోం సీరియల్ ముగింపు చాలా బాగుంది విశ్వం చనిపోవటం చాలా బాధగా అన్పించింది రచించిన 'శ్రీరంగం' గారికి నా కృతజ్ఞతలు.

కె పద్మాసుబ్రహ్మణ్యం [కొత్తగూడెం]



మీ [ మా ] వారపత్రికలోని 'నర్సింగ్‌హోం' సీరియల్ చాలాబాగుంది. రచయిత శ్రీరంగంగారికి శుభాకాంక్షలు. సీరియల్ మొదటి నుంచి చాలా బాగాపాటకుల్ని ఆకట్టుకొంది.పెద్దసర్జనులనుండి ఆర్ ఎం డిల వరకు వారి జీవనసరళి, వృత్తి లోపాలు,ఆశలు, అనుభవాలు బాగా చిత్రీకరించారు.

ఈ నవల ముగింపు చాల హృదయ విదారకంగా హృదయాన్ని పిండేటట్లుగా యుంది. ప్రాక్టీసులో తలమునకలై రెండు చేతులా ఆర్జించే ప్రముఖ వైద్యులు వారి జీవితములో ఏమి పోగొట్టుకుంటారో వివరముగా డాక్టరు విశ్వంపాత్రలో నిరూపించి కళ్లకు కట్టినట్లు చిత్రీకరించారు.

డాక్టరు కె ఎస్ శివాజి [ ఖమ్మం ]

* * *

దీపావళి సంచిక చదివాను ''నర్సింగ్‌హోం'' ముగింపు వూహకు అందనిది చివర్లో విశ్వంగారి ఆత్మాహుతితో సీరియల్ ముగిస్తారని వూహించలేదు సీరియల్ మొదటినుండి చివరి వరకూ మంచి విజ్ఞానదాయకంగావుంది. డా విశ్వం, డా శేఖర్, రాధాకృష్ణ వంటి వేరువేరుమనస్తత్వాల పాత్రలు మలచటంలో శ్రీరంగం తమ అనమాన ప్రతిభ చూపారు.

మటికాన ప్రకాష్ [ కాకినాడ ]

* * *

''నర్సింగ్‌హోం'' సీరియల్ చాలా బాగున్నది. సీరియల్ అప్పుడే అయిపోయిందా అనిపించుచున్నది. రచయిత శ్రీరంగంగారికి నా కృతజ్ఞతలు.

డి. ప్రసాద్, చిన్ని [వరహాపురం]

దీపావళి సంచిక చాల బాగున్నది. 'నర్సింగ్‌హోం' సీరియల్ ... చక్కగా ఉన్నది డాక్టర్ విశ్వం గారిపాత్రసృష్టి .రచయిత శ్రీరంగంగారికిహృదయపూర్వక అభినందనలు ఇకపోతే కుందుర్తి ఇందిరాదేవిగారి కొత్తసీరియల్ 'జీవితవనంలో కొత్తగాలి' ప్రారంభంలోనే చాలా ఆకర్షణీయంగా ఉన్నది.

అంసాడ విజయలక్ష్మి, ప్రసాదరావుపేట[ఒరిస్సా]

* * *

మీరు ప్రచురించిన 'నర్సింగ్‌హోం' చాలా బాగుంది అందులో 'విశ్వం'పాత్ర చిత్రీకరణచాలా చక్కగావుంది. ఇంత మంచి సీరియల్ అందచేసినందుకు ధన్యవాదాలు

గుడిపాటి కనకదుర్గ [ బాపట్ల ]

* * *

దీపావళి సంచికలో నర్సింగ్‌హోమ్ ముగింపు చదివిన తర్వాత చాలా బాధగా ఉంది విశ్వంగారి పాత్ర చాలాబాగుంది. శ్రీరంగంగారికి నాఅభినందనలు.

హేమావాణి [ గుడివాడ ]

* * *

మా అత్యంత అభిమాన ఆంధ్ర సచిత్ర వారపత్రిక దీపావళి ప్రత్యేక సంచిక మాకెంతగానో నచ్చింది ముఖ్యంగా జీవిత వనంలో కొత్తగాలి సీరియల్ ప్రారంభంలో పసందుగా ఉంది. ప్రచురించిన కార్టూన్లు నవ్వించాయి.

కృష్ణలీల, వై చంద్రశేఖర్ రెడ్డి, కామేశ్వరి, రాధ (తిరుపతి)

* * *

శంకుగారి కార్టూన్ ముఖ చిత్రంగా వేసిన దీపావళి సంచికను ఎక్కువ పేజీలతో, కథలతో, కార్టూన్లతో మాకు అమితానందాన్ని కలిగించారు. కథలలో జెలసీ ఈజ .కథ బాగుంది. ముఖ్యంగా ఇందులో ప్రతికార్టూన్ మా చిత్తూరు పాటులా పేలిందంటే నమ్మండి

ఎస్. అన్వర్ హుస్సేన్, [చిన్నగొట్టిగల్లు]

* * *

దీపావళి సంచికలో ప్రచురితమైన, కె విజయలక్ష్మిగారి రచన జెలసీ ఈజ నథింగ్ బట్ లొ చదివాను చివర్లో కళ్లలో నీళ్లు తిరిగాయి. ఎంతటి సంస్కార వంతమైన రచన' నిజంగా అందరూ తప్పకుండా చదవవలసిన రచన ఇది. రచయిత్రికి నా హృదయ పూర్వక అభినందనములు

పూడిపెద్ది పరశానాద్ [హైదరాబాద్]

* * *

దీపావళి సంచిక చాలా ముచ్చటగాఉంది వ్యంగ్య చిత్రాలుగా భావింపబడే 'లోకంపోకడ' ఊమెన్‌గారి కార్టూన్లు భావగర్భితముగా ఉన్నాయి

డా సిహెచ్ గణేశ్వరరావు [టిట్లాఘడ్]

* * *

దీపావళి సంచిక ముఖచిత్రం చాలా బాగున్నది. కార్టూన్లు, కథలు బాగున్నాయి

పాక జ్ఞానసాగర్ [దుగ్గిరాల]

# 11-12-81 సంచికలో ప్రారంభం!

# కొత్త సీరియల్

# "తార"

## రచన: శ్రీ మతి హజరా

## దీపావళి సంచిక

ఆంధ్ర సచిత్ర వారపత్రిక 30 10 1981 సంచికలో శ్రీ గరికపాటి కృష్ణమూర్తి గారి పెద్ద కథ వో సత్యం కథలో సత్యం వెళ్ళిన్నది శివాలయం అక్కడ కలుసుకొన్నది ఆచారి గార్ని శివాలయాల్లో ఎక్కడా ఎప్పుడూ శ్రీవైష్ణవ పూజార్లు ఉండరు ఇంక సత్యం వయస్సులో ఆచారి గారి కన్నా చిన్న వాడు కనుక, ఆచారి గారు అని వ్యవహరించడం అనుచిత్యంగా ఉంటుంది. ఒక్కోసారి గౌరవ వాచకం, ఒక్కోసారి ఏక వచనం ప్రయోగం రాసేరు. ఇది బాగా లేదు.

సి. హెచ్. గుర్రాజు [ధవళేశ్వరం]

* * *

ఆంధ్ర సచిత్ర వారపత్రిక దీపావళి సంచికలో కథలు చాలా బాగున్నాయి వో సత్యం కథ (పెద్ద కథ)నాకెంతో నచ్చింది జోక్స్ చాలా బాగున్నాయి. కొత్త సీరియల్ జీవిత వనంలో కొత్తగాలి ప్రారంభంలోనే నాకు నచ్చింది

కృష్ణ, చంద్ర, శ్రీను, సరోజ, చిన్ని, బాబు. (పొన్నూరు)

* * *

శంకు ముఖచిత్ర రచనతో ముస్తాబైన [30 10 81] దీపావళి సంచిక అందుకోగానే చిరు నవ్వుల జల్లులలో మనస్సుల్ని ముంచెత్తింది. కొత్త సీరియల్ జీవిత వనంలో కొత్తగాలి ఆరంభంలోనే ఆకట్టుకున్నది 'డెంట్ ఈజ్ నథింగ్ బట్ రా' కథ నాకు బాగా నచ్చింది రచయిత్రికి అభినందనలు.

కె వి ఎస్ ఎల్ నరసింహారావు, [కొండేపూడి]

* * *

30 10 81 నాటి దీపావళి సంచిక ఎంతో బాగుంది 'ధర్మపథం'లో బులుసు వెంకట రమణయ్యగారు 'స్వేచ్ఛా గానం' గురించి చక్కగా వివరించారు.

పిసపాటి చంద్రశేఖర్ [పొన్నూరు]

* * *

'శంకు' ముఖచిత్రారవిందంతో వెలువడిన ఈఏటి దీపావళి సంచిక తడిపొడిగా ఉండి "తుస్సు తుస్సు"మను కార్టూన్లు కొన్ని ఉన్నా, గాలి,ఎండ తట్టి కాల్చిన టపాకాయల్లా "ఢాం" అని పేలిన కార్టూన్లు ఎక్కువగా ఉండడం విశేషం.

"జీవితవనంలో కొత్తగాలి" ఎంచక్కా ప్రారంభం అయ్యింది. పసి పాపకి చక్కటి గిలక్ ఈ వారం పత్రిక తిరగేసేసరికి [100 పేజీలు]చేతి ప్రేణాలు అరచేతిపళ్ళకు వచ్చాయి. నిజంగా చాలా చాలా థాంక్యూనూ, కంగ్రాచ్యులేషన్స్‌నూ!

గణేష్‌పాత్రో చిన్న చిట్కా సమాజానికి పెద్ద టానిక్కులాంటిది 38వ పేజీలోని కార్టూన్ నిజంగ అనందించ దగ్గదనిపించి నవ్వించింది

పెన్మెత్స నారిబాబు [గొల్లపాలెం] ●

లోకం పోకడ ✳ డోమెన్









# ఫాలాక్షుని డైరీ

> ఇక్కడ ప్రభవిస్తోంది ఉషస్సు
>
> విశ్వబ్బాన్ని నమిలి
> జీర్ణించుకోలేని కీచురాళ్లు
> ప్రజల కోసమే పుట్టి
> ప్రజల కోసమే ప్రాణాలిచ్చే
> ప్రజానాయకుల ఉపన్యాసాల్ని
> వెతుక్కుంటూ వెళ్లిపోయాయి !
>
> — కలికిరి వి. అబ్దుల్ ఖాదర్

## చేతి చలవ !

కేదారపాండేగారు కేంద్ర రైల్వే శాఖమంత్రిగా పదవీ స్వీకరణ చేసినప్పటి నుంచియీనాటికి వెయ్యి రైలు ప్రమాదాలకు పై 23 జరిగాయట అనగా తొమ్మిదివందల డెబ్బయ్యేడు రైలు ప్రమాదాలు జరిగాయట. వీటిలో చాలా ఘోర ప్రమాదాలు ఉన్నాయటకూడాను.

## గుండె ప్రయాణం !

ఎలిజిబెత్ (అనే వూరు)లో వో కారు ప్రమాదంలో చనిపోయిన వ్యక్తి గుండె కాయను తీసి, 640 కిలోమీటర్ల దూరంలో ఉన్న కేప్‌టవున్ (అనే వూరు)కు రప్పించి, అక్కడి వో ఆసుపత్రిలో గుండె జబ్బుతో బాధ పడుతున్న వో 29 ఏళ్ల యువకునికి అమర్చారట డాక్టర్ క్రిస్టియన్ బెర్నార్డ్,

## ఖైదీని పెళ్లాడిన కోటీశ్వరుడు !

టెక్సాస్‌కు చెందిన 52 ఏళ్ల డోనాల్డ్ లయిజర్ అనే కోటీశ్వరుడు యథాలాపంగా కాలిఫోర్నియా జైలును చూడబోయి, ఆ జైల్లో యావజ్జీవ శిక్షననుభవిస్తున్న సూసన్ అట్కిన్స్ అనే ఆమెను చూసి, తొలి చూపులోనే ప్రేమించి, ఆ వెనువెంటనే ఆమెను పెళ్లాడేశాడట, జామ్మని ఆ సుసన్ అట్కిన్స్ షరన్‌టాట్ అనే వో నటిని ఇంకో ఆరుగుర్ని కలిసి కట్టుగా చంపినేరానికి యావజ్జీవ శిక్ష అనుభవిస్తోందట తన భార్య సుసన్‌ను చూసుకోడానికి వీలుగా జైలుకు దగ్గరగా తాను 12 మిలియను డాలర్ల ఖరీదుతో వో భవనం కట్టించదల్చుకున్నట్టు కుబేరుడన్నాడట.

## కట్న పిశాచి విలయ తాండవం !

ఢిల్లీకి చెందిన కరుణా ఖోస్లే అనే ఆమెకు 1976 ఫిబ్రవరి నాలుగోతేదీన న్యరన్ వార్ తో వివాహం జరిగిందట. ఆమె డబుల్ ఎమ్మేఅట 1980 మార్చి నాలుగో తేదీన ఒళ్లు బాగా కాలిపోయిన స్థితిలో సఫ్దర్ జంగ్ ఆసుపత్రిలో చేర్చబడి, పదహారో తేదీన చనిపోయిందట. ఆమె చావు ఆత్మహత్య కాదని పోలీసులు తేల్చినా, ఆమె తండ్రి అది ఆత్మహత్యేనని, తనకూతురుమరణాన్ని పునర్విచారణ చేయాలని ప్రధాని గాంధికి రాశారట తన కూతురు ఒళ్లు కాలిన వెంటనే తనకు తెలియజేయలేదని, ఆమె మరణ వాఙ్మూలం ఇస్తూండగా తనను అక్కడ పోలీసులు ఉండనివ్వలేదని ఆమె తండ్రి వాపోయాడట. కట్న పిశాచి విలయతాండవమే నా కూతురు చావుకుకారణమన్నాడటాయన.

## నలుగురిని బలితీసుకున్న ఇంటిలోని పోరు !

హిందవున్ అనే వూరిలో భర్తతో పోట్లాట, రగడ, రభస భరించలేని రుక్మిణి వాలి అనే వో ఇల్లాలు తన ముగ్గురుపిల్లలనూ తీసుకునిఇల్లొదిలి వో బావిలో దూకి ఆ ముగ్గురు పిల్లలతో సహా తానూ చనిపోయిందట. ఈ వార్త తెలిసిన ఆమె భర్త భుల్లన్ రైలు క్రింద తలపెట్టి తనూ ఆత్మహత్య చేసుకున్నాడట.




## హత్యకి కారణం అక్రమ సంబంధం !

ఇడప్పాడికి చెందిన చిన్నపొంని అనే ఆమె భార్య చిన్నతాయి అదే వూరుకుచెందిన కందసామి అనే అతనితో రహస్య ప్రేమాయణం జరిపేదట చిన్నతాయిని తాను నిరంతరంగా ఉంచుకోడానికి చిన్నతంబి అడ్డు అవటాని ఆలోచించి, ఆ చిన్నతంబిని ఏమార్చి పీకమొయ్యా కల్లు పట్టించి, మైకంలో ఉండగా అతన్ని చంపి, ఏట్లో పారేసి, చేతులు కడుక్కున్నాడు.

## వికటించిన సూది మందు !

మద్రాసుకు చెందిన వో ముస్తఫా నాలుగేళ్ల క్రితం మద్రాసులో వాతపడి ఏదో తుప్పు వస్తువు గుచ్చుకున్నదట, ఎందుకైనామంచిదని మద్రాసురాయపేటప్రభుత్వ ఆసుపత్రికి వెళితే అక్కడ అతనికి వో డాక్టరు టెటానస్ టాక్సాయిడ్ అనే ఇంజక్షనిచ్చాడట ఇంటికిచేరిన అతనికిగుండెనొప్పి,ఒళ్లంతాదద్దుర్లు వచ్చాయట. దాంతో మళ్లీ ఆసుపత్రికి వెళ్ళేసరికి వారు చికిత్స చేసేలోపుగానే అతను చనిపోయాడట.

## కాపురానికి రాని భార్య తల నరికిన భర్త !

కృష్ణగిరికి చెందిన 20ఏళ్ల వూరిగౌడికి 24 ఏళ్ల పిడియప్పను తో పెళ్ళయి ఏడాదైనా ఆమె కాపురానికి పోనేరదట పిడియప్పను తనకు నచ్చలేదని తండ్రితో తెగేసి చెప్పిందట. ఆ పిడియప్పను కాపురానికి రమ్మనాని ఎంతో బ్రతిమాలి, ఒప్పుకోకయేపోసరికి, దారి కాచిపొలంకు వస్తున్నామెను కత్తితో పొడిచి చంపి, అంతటితో ఆగక ఆమె తల నరికి వేరు చేసి, చేతో పట్టుకుని వూరంతా వూరేగింపుగా తిరిగి, ఆనక పోలీసులకు లొంగిపోయాడట.

## నగ ? !

కలకత్తాకు చెందిన 34 ఏళ్ల చంద్ర మోహన్ సహా అనే ఆయన జులై 21వ తేదీ సాయంత్రం 5 30లకు తమ్ముళ్లతో బజారునుంచి తిరిగిఇంటికి వెళ్తుండగా వో 25మంది ఆయన్ని అడ్డగించి, చితకబాది కిందపడేశారట. ఆ గ్రూపులో ఒకడు నాతని గుండెలుమీదకూర్చుని నీ కాంగ్రెస్ (ఐ) పార్టీ నిన్నెలా రక్షించగలదో చూద్దాం పట్టు అని అతని రెండు కళ్ళు పెకలించి పారేశాడట.

# మిల్క్‌మెయిడ్
## రుచికరమైన పాల తయారీకి

అతి రుచికరమైన పాలకోసం
3 అనువైన పద్ధతులు.

400 గ్రా. మిల్క్‌మెయిడ్ డబ్బాను తెరవండి.




అందులో వున్నదాన్ని 2 లీటర్ల పాత్రలో పోయండి.



ఖాళీ అయిన మిల్క్‌మెయిడ్ డబ్బాతో కొలిచి 3-4 రెట్లు మీ రుచిని అనుసరించి నీళ్లు కలపండి. బాగా కలపండి. అత్యంత రుచికరమైన తీయని పాలు మీకు లభిస్తాయి.



ఇప్పుడు చెప్పినట్లు కలిపిన పాలు వంట పదార్థములు చేయడానికిని మరియు సాధారణ వాడకమునకు మాత్రమే.

కావలసిన విధంగా రుచికరమైన తీయని పాలను తయారుచేసుకున్న తర్వాత, ఆ పాలతో మీరు పాయసం, మిల్క్‌షేక్స్, రాజ్‌భోగ్, బర్ఫీలాంటి నోరూరించే రుచికరమైన తీపి తినుబండారాల్ని తయారుచేసుకోండి. మిల్క్‌మెయిడ్‌లో తీపి వున్నది. ధరలు పెరిగిపోతున్న ఈ రోజుల్లో మీకు పంచదార ఖర్చు కలిసివస్తుంది కూడా.




## మిల్క్‌మెయిడ్
## అతి రుచికరమైనది

CAS-500R

# పరోపకారమా! వర్ధిల్లు...

పాలగిరి వేణు



'బడ్జెట్ మీటింగు' పూర్తి చేసుకొని ఇల్లు చేరుకొనేసరికి రాత్రి తొమ్మిదయింది. స్కూటర్ని 'అప్రోచ్‌రాంప్'లోనే 'పార్క్' చేశాను.

'చన్నీళ్ళ'తో స్నానం చేశాకగాని ప్రాణం స్థిమితపడలేదు.

మా ఆవిడ 'కాఫీ' యిస్తానంటే వద్దని, ఒకేసారి భోజనాన్ని వడ్డించమన్నాను.

అన్నం ముద్దలా వుంది వేపుడు మాడిపోయి వుంది పులుసులో వుప్పెక్కువ. పెరుగు పుల్లగా వుంది.

ఆకలికి రుచి విరిగినా కడుపు నిండా తిన్నాను. తిన్నాక పెరట్లో బాదం చెట్టు కింద వాలుకుర్చీవేసుకొని అలా విశ్రమించాను.

పెద్దబ్బాయి ఏదో ఇంగ్లీషు పద్యాన్ని గట్టిగా చదవుతూ కంఠతా పెట్టేస్తున్నాడు.

మా ఆవిడ వంటింట్లో ఏదో చప్పుడు చేస్తోంది.

చల్లనిగాలితోవాతావరణం హాయిగావుంది. బాదంచెట్టులోంచి వీధి 'లైటు' వెలుతురు జల్లుజల్లుగా పడుతోంది. అలా కళ్ళుమూసుకున్నానేమో నిద్ర పట్టేసింది.

"బాలూ!" అంటూ చెవిలో పిలిచినట్లయ్యింది. మెల్లగా కళ్ళు తెరిచాను. ఎదురుగ్గా సిమ్మెంటు బెంచీమీద 'విస్సూ' కూచుని వున్నాడు.

"ఏరా బాలూ! నీతో అర్జంటు పని పడి వచ్చాను."

"విస్సూ! ఏం పనిరా? యీ టైంలో... డబ్బేమైనా కావాలా?" 'విస్సు' అవసరాలు నాకు బాగా తెలుసు. అందుకే అడిగాను.

"కాదురా బాబూ! మా చినమావయ్య కూతురు కూతురికి అన్నప్రాసనట ... మమ్మల్ని వున్నఫళంగా రమ్మని టెలిగ్రాం యిచ్చారు. రజని వాళ్ళను "జనతా" కు ఎక్కించి వస్తాను నీ 'స్కూటర్' కావాలి!" అంటూ 'విస్సూ' వివరిస్తున్నాడు.

"నీవు వెళ్ళటంలేదా ?" అంటూ అడ్డు తగిలాను

"ఎన్నిసార్లని వెళ్ళనా బాబూ! ప్రతి చిన్నదానికి టెలిగ్రామో, ట్రంకాలో చేసి కూచుంటారు మా వాళ్ళు. ఈసారి రజనిని, బాబుగాణ్ణి పంపిస్తాను. నాకు వచ్చే జీతమంతా యీ రాకపోకలకే సరిపోతోంది ... 'ఆటో' కోసం 'ట్రై' చేశాను. లాభం లేకపోయింది" విస్సూ యింకా ఏదో చెప్పబోతున్నాడు...

"సరేలే! తీసుకెళ్ళు" అంటూ మా పెద్దబ్బాయిని పిల్చి, టేబిల్ మీదున్న 'స్కూటర్ కీస్' తీసుకురమ్మన్నాను.

"పెట్రోల్ రిజర్వులో వుంది"

"ఫర్వాలేదు, రామారావు దగ్గర రెండు సీసాలు తీసుకుంటాను" మా పెద్దబ్బాయి 'కీస్' తెచ్చిచ్చాడు. విస్సు చేతిలో పెట్టాను.

"పని అవుతూనే వచ్చేస్తావుగా"

"రెండు కల్లా వచ్చేస్తాను...స్కూటర్ని రాంప్‌లోనే వుంచమంటావా? లేక నిన్ను లేపమంటావా ?"

"నన్ను లేపు."

విస్సు స్కూటర్ని స్టార్ట్ చేసుకొని రయ్యని దూసుకెళ్ళిపోయాడు.

"విశ్వనాథంగారు వీటువెళుతున్నారేమిటి?" అంటూ మాఆవిడ నా ఎదురుగ్గా సిమ్మెంటు బెంచీమీద కూచుంది. అన్నం, వేపుడు, పులుసు, పెరుగు ఒక్కసారిగా గుర్తుకొచ్చాయి. మౌనంగా వుండిపోయాను.

"సెకండ్ షో సినిమాకా?"

ఆరాలు మొదలెట్టింది...ఇక లాభంలేదు.

"కాదు, రామగుండం స్టేషనుకు. 'జనతా'కు వాళ్ళావిడను, అబ్బాయిని వదిలి వస్తాడట. రెండుకంతా వచ్చేస్తానన్నాడు. స్పీడు వెళ్ళొద్దన్నాను. జాగ్రత్తగా వెళ్తానన్నాడు. స్కూటర్‌కేమీకాదు."

"మీ యిష్టం స్వామీ! యిలా పదిమందికి బండి యిస్తూనే వుండండి జీతమంతా దాని రిపేర్లుకే సరిపోతుంది. వెధవ మొహమాట మూనూ మీరూనూ. ఎవ్వరికీ బండిని యివ్వనని ఖచ్చితంగా చెప్పలేరూ" నసుగు

## పరోపకారమా! వర్ధిల్లు...

తూనే వుంది. నసగడంతో పాటు గొణుగుడు కూడ జత కల్సింది.

"అవసరమని యిచ్చాను" అన్నాను విసుగ్గా.

"ప్రతివాడి అవసరానికి మీరే వున్నారా? మీ స్కూటరే కావల్సి వచ్చిందా? నాకు తెలియక అడుగుతాను—తలమాసిన ప్రతి వెధవా మీ స్కూటర్నే అడుగుతారేమిటండీ!..."

లోన చిన్నాడి వీపు పగిలినట్టుంది. కెవ్వున కేకలేస్తూ ఏడ్పు మొదలెట్టాడు. మా ఆవిడ లోనికెళ్ళింది పిడుగులాంటి నడకతో. పెద్దోడి వీపు మోగింది. చిన్నాడు వూరుకుండి పోయాడు పెద్దోడు ఏడ్పుకులంకెపెట్టాడు.

బలవంతంగా కళ్ళు మూసుకున్నాను.

మేమున్న 'కాలనీ'కి రావుగుండం స్టేషను కెళ్ళాలంటే మాకు ఏలాంటి ప్రయాణ సౌకర్యాలు లేవు. హైదరాబాద్ కెళ్ళే బస్సులు స్టేషను ముందే వెళ్ళాయి. కాని రైళ్ళు వచ్చే సమయానికి బస్సుల్లేవు. —'ఆటో'లు కూడా దొరకవు రైలు కెళ్ళాలంటే ఎవరిదో స్కూటర్ని అడిగి వెళి రావటం పరిపాటి మా అందరికీని. నిజం చెప్పాలంటే మా "ఫ్రెండ్ సర్కిల్"లో నా కొక్కడికే స్కూటరుంది. మొదట్లో గర్వకారణమయినా యిప్పుడు "స్కూటరెందుకుంది స్వామీ" అంటూ బాధ పడుతున్నాను. మా బామ్మర్దిగారు అంటే మా ఆవిడ తమ్ముడు 'కెనడా'లో వున్నాడు. వాడు 'డాలర్స్' పంపటం, తద్వారా 'చేతక్'ని సంపాదించడం జరిగింది. అంటే "స్కూటర్" మీద సర్వాధికారాలు మా ఆవిడకే వున్నాయి

నేను మా ఆవిడగారి భర్తగార్ని కాబట్టి ఆ సర్వాధికారాల్ని ఆమోదించాను. కాని ఆమె ఆజ్ఞలను పాటించే అవకాశం మాత్రం కలగ లేదు. ఎందుకంటే 'నేను మొగవాణ్ణి' కాబట్టి...

ఓ పదిహేను రోజుల క్రిందట సుబ్బారావు ఏదో అర్జంటూ పనుందంటు 'గోదావరిఖని' వెళ్ళాలని స్కూటర్ని తీసుకెళ్ళాడు. వచ్చేటప్పుడు ఎక్కడ గుద్దాడో, ఎవర్ని గుద్దాడో తెలియదు కాని, ముందు వైపు మాత్రం పెద్ద సొక్కు పడింది. మెకానిక్ రాజుని అడిగితే 'ఏ గాడీ హైదరాబాద్‌కో లేకీ జానేకా సాబ్'' అంటూనే చెక్క సుత్తితో ఆ సొక్కు మీద రెండుదెబ్బలేశాడు. రంగైతే పూడలేదుకాని సొక్కులు మాయమయి 'సిట్'గా 'సెట్' అయ్యింది. దెబ్బకు ఐదు రూపాయల చొప్పున ఒక నిముషంలో పది వసూలు చేశాడు మెకానిక్‌రాజు. ఈ సంగతి సుబ్బారావుకు నోటిమాటగా చెప్పాను. ఎంత సేపు మెకానిక్ రాజును పొగుడుతున్నాడేగాని సుబ్బారావు సొక్కులకయిన రిపేరు ఛార్జి సంగతి ఎత్తనేలేదు. ఆ రోజు సుబ్బారావు వెళ్ళిన అర్జంటు పని సూపర్ బజార్లో ఒక 'బీర్' బాటిల్ తెచ్చుకొందామనట ... అన్నీ యిల్లాంటి 'అర్జంటు' పనులుంటాయి అందరికీను...

ఓ వారం రోజుల క్రిందట జాన్సన్‌శాస్త్రి అలా 'ఫ్యాక్టరీ' వరకు వెళ్ళొస్తానని, ఓ పది నిమిషాల్లో వచ్చేస్తానని, రెండుగంటల్లో తిరిగొచ్చాడు ''చూడు బ్రదర్! క్లచ్‌వైరు బ్రేకు అంత 'లూస్'గా వున్నాయేంటి? సర్వీసింగ్ చేయిస్తున్నావా? లేదా!? ఆ 'బీటింగ్' చూశావా? ఎంత దరిద్రంగా వుందో?'' అంటూ స్కూటర్ని నా ముందే పార్క్ చేసి తాళపు గుత్తుల్ని చేతిలో వుంచి, యింకో అర్జంటు పనుందంటూ వెళ్ళిపోయాడు.

క్లచ్‌వైరు విరిగిపోయి వుంది 'బ్రేక్' పడడం లేదు. 'హెడ్ లైటు' వెలగటంలేదు. మెకానిక్ రాజుకు చూపించాను. ''ఏ గాడీ హైద్రాబాద్‌కో లేకీ జానేకా సాబ్!' అంటూనే మెకానిక్ రాజు 'సర్వీసింగ్'చేశాడు. క్లచ్ వైరు కొత్తది వేశాడు. 'బ్రేక్' ఫిట్ చేశాడు ఏదో 'పాయింట్స్' సెట్ చేశానన్నాడు. 'బీటింగ్' బ్రహ్మాండం అన్నాడు. 'థరీ గ పీస్' అంటూ ఇంగ్లీషులో చార్జ్ చేశాడు. రెండు ఇరవైలు యిచ్చాను. చిల్లర లేదంటూనే ఇంకోసారికి సర్దుతానన్నాడు.

''ఫిర్! కబ్! ఆతా సాబ్!!'' అంటూ తన సహజమైన వ్యాపార ధోరణిలో మాట్లాడాడు. ఏమీ లేనిచోట 'ఆముదం చెట్టే మహా వృక్షమన్నట్లు' వున్నాడు ఈ మెకానిక్ రాజు.

మళ్ళీ ఆ రోజు విస్సుగాడు.

''ఇక లేవండి. లోన శుభ్రంగా పడుకోక'' అంటూ మా ఆవిడ నన్ను కదిపింది. వాలు కుర్చీని మడిచి చేతో పట్టుకొని, 'స్టోరు రూం'లో నుంచి 'బెడ్ రూం'లో కెళ్ళాము పడుకోడానికి.

''చూడండి! స్కూటర్ని ఏదో ప్రాణం మీదకొచ్చే అవసరం వుందంటే, యిస్తున్నా రంటే నేనేం తప్పు పట్టను. విశ్వనాథం గారికి బెల్లిగాం వచ్చి రెండు గంటలయ్యిం దారి కదా! శుభ్రంగా పది గంటలకెళ్ళే బస్సులో వెళ్ళొచ్చు గదా! ... పెట్రోలు ఖర్చని మనమే ఎక్కడికీ వెళ్ళమే! అల్లాంటిది మీ స్నేహితులు మీ స్కూటర్ని యిష్టమొచ్చినట్లు వాడేస్తున్నారు కదా! పోసి పెట్రోలు పోయించుకుంటారా! అదీ వుండదు. ఈ తప్పంతా మీది ... మీ మొహమాటమూనూ, చేతకాని తనమూ! తీసుకెళ్ళేవారు ఏదైనా 'ఆక్సిడెంట్' చేశారనుకోండి...'' అంటూ మా ఆవిడ పెద్ద లెక్చరిస్తుంటే నాకు ఒళ్ళు మండుకొచ్చింది.

''నోరు మూసుకు పడుకుంటావా? లేదా? పెద్ద సొద'' అంటూ గట్టిగా కోప్పడుతూవిసుక్కున్నాను. మా ఆవిడనోటితో బాటు కళ్ళు కూడ మూసుకున్నట్టుంది. ఓ ఐదునిమిషాలయ్యాక 'గురక' పెట్టడం మొదలయ్యింది.

అవును యిదంతా నా అసమర్థతే! లేకపోతే ప్రతి వెధవా నమ్ము, నా స్కూటర్ని తెగ పొగిడేసి, ఏదో 'అర్జంటు' పనుందంటూ జేబులోంచి 'స్కూటర్ కీస్' లాక్కొని, నా కళ్ళ ముందే స్కూటర్ని 'స్టార్ట్' చేసి, పిచ్చి పిచ్చిగా 'గేర్సు' మార్చి 'రేసుగుర్రం'లా 'గ్యాలప్' చేయించడం, ఇక లాభంలేదు ... 'ఫుల్‌స్టాప్' పెట్టేయ్యాలి. ఎవరడిగినా స్కూటరివ్వకూడదు – అంటూ దృఢమైన నిర్ణయం చేసుకున్నాను ... నిద్ర పట్టొంది అల సోకగా ... దోమలు తెగ కుట్టేస్తుంటే నిద్ర సరిగా పట్టడంలేదు...'దాహం' అయితే లేచి, లైటు వేసి, 'టేబుల్' మీదున్న నీళ్ళ గ్లాసు వందుకుని దాహం తీర్చుకున్నాను. 'అలారం పీస్' నాలుగ్గంటలు చూపిస్తోంది. స్కూటర్ గుర్తొచ్చింది. తలుపు తీసి చూశాను. స్కూటర్ లేదు. 'విస్సు యింకా రాలేదన్నమాట. 'జనతా' రామగుండానికి రాత్రి ఒంటిగంట ప్రాంతాని కంతా రావాల్సి వుంది; జనతా లేటేమో?' సమాధాన పరుచుకోబోయాను. నిద్ర పట్టడంలేదు. 'రాంప్‌వే' లోనే అటూ యిటూ తిరుగుతూ స్కూటర్ గురించే ఆలోచిస్తున్నాను. ఏదైనా ఆక్సిడెంట్ జరిగితే! ఒక్కసారిగా గుండె ఆగినట్లయ్యింది యీ వూహతో. రోడ్డు కూడా బావుండదు. అందులోను 'హెవీ ట్రాఫిక్'.



వర్షంపుణ్యమా అంటూ రోడ్డంతా గుంటలు పడి, గోతులతో మరీ అధ్వాన్నంగా తయారయింది రోడ్డు బావున్న చోటేమో యిసుకతో పేరుకుపోయి వుంది. బండికేదైన జరిగితే... సరిగ్గా పది రోజుల క్రిందట 'జ్యోతీనగర్ కాలనీ' వద్ద రాత్రి ఒంటిగంట ప్పుడు, స్కూటరొకటి లారీకి ఢీకొంది. స్కూటర్ పచ్చడయిపోయింది కాని లారీ కేమీ కాలేదు. స్కూటర్ నడుపుతున్నతను అక్కడికక్కడే... అలాగే 'విస్సూ' కేమైనా? అదో రకమైన భయంతో, పిచ్చి పిచ్చి భయంకరమైన ఆలోచనలతో మెదడు, శరీరం మొద్దుబారిపోయాయి. రోడ్డుమీద కొచ్చి నిలబడ్డాను. నిశ్శబ్దంగా వుంది వాతావరణం.

"ఏమండీ! బాలూగారూ!! ఈవేళప్పుడు మీరు...?" అంటూ ప్రశ్నించాడు రామారావు సైకిల్నాపి.

"ఏం లేదండీ! నిద్ర పట్టడం లేదు. ఇంట్లో వుక్కపోస్తూంటే అరుబైటకొచ్చి అలా గాలికోసం నిలబడ్డాను."

"షిఫ్టు మండి ఇప్పుడే వస్తున్నట్టుంది" అంటూ రామారావుగార్ని ప్రశ్నించాను.

"బాగా రొంప పట్టింది. "అనీజి"గా వుంది... "షిఫ్టు ఇన్‌ఛార్జ్"కు చెప్పి రెండు గంటలు పర్మిషన్ తీసుకొస్తున్నాను. మీకేంటండీ "వైట్ కాలర్స్" మేము చూడండి ... రాత్రనక పగలనక కష్టపడి, చెమటోడ్చి..." అంటూ రామారావు సైకిల్ దిగాడు. జిడ్డు వెధవ, పట్టుకుంటే ఓ పట్టాన వదలడు దేశానికంతా తనొక్కడే కష్టపడుతున్నట్టు ఫోజెక్కువ. రామారావు కష్టాలకు అంటకత్తెర వేయాల్సిందే.

"ఏంలేదండీ! మా 'విస్సూ'గాడున్నాడే! రాత్రి జనతాకు వాళ్ళావిడను, అబ్బాయిని వదిలొస్తానని నా స్కూటర్ తీసుకెళ్ళాడు. ఇంతవరకు రాలేదు అందుకని ఇలా బైటి కొచ్చి నిలబడ్డాను" అన్నాను వాలో వున్న కంగారును కొంత ఆపుకుంటూ...

రామారావు పెద్దగా నవ్వాడు...

"ఎందుకండీ కంగారు పడుతున్నారు! జనతా లేటుగా వచ్చిందేమో. మిగతా సంగతి మీకు తెలుసుగా... ఈ టయానికక్కడ రాక పోయిందేమో. మీరు అనవసరంగా భయపడకండి .."

"అది కాదు రావుగారూ? రోడ్డు బాగా

# పరోపకారమా! వర్ధిల్లు...

లేదు. ఈ మధ్య 'యాక్సిడెంటు' కూడ ఎక్కువయ్యాయి. బండికేమైనా ఫర్వాలేదు గాని మనిషి కేమన్నా అవుతే..."

రామారావు మళ్ళీ బిగ్గరగా నవ్వాడు ... నవ్వుతోబాటు ముసి ముసి దగ్గులు కూడ...

"ఏం కాదండీ! విస్సూగారు ఎంత జాగ్రత్తగా బండి నడుపుతారో మీకు తెలుసు కదా? 'ఆక్సిడెంటు' అయ్యే అవకాశమేలేదు ఆ మరిచాను. బండికి 'ఇన్సూరెన్స్'వుందిగా? అయితే యింకేం బాధలేదు. అది కాదు బాలూగారూ! ఎందుకు మీరిలా బెంబేలు పడుతున్నారో అర్థం కావటంలేదు. నా స్కూటరుంది చూశారు? ఎంతమంది తీసుకెళ్తుంటారో తెలుసు కదా? ఇంతవరకు

> **బాట**
>
> నేనూ
> ఒక
> బాటసారిని
> కావాలని
> ఉబలాట పడుతున్నా!
> కానీ
> నాకు
> బాట
> కన్పించడంలేదు.
>
> — బిట్టు

ఏల్లాంటి చిన్న 'ఆక్సిడెంటు' కూడ కాలేదు. అవసరానికి యివ్వకపోతే ఎందుకండీ?" అంటూ రామారావు చెప్పుకు పోతున్నాడు. రామారావుకక్కడ స్కూటరుంది దాన్ని పువ్వుల్లో పెట్టి పూజిస్తాడు రోడ్డుమీద కదిలితే ఎక్కడ 'టైరు' అరుగుతుందోననే మనస్తత్వం కాని కంపెనీ వాళ్ళిచ్చే అలవెన్సు మాత్రం తీసుకొంటాడు, అప్పుడప్పుడు స్కూటరు వాడుతున్నట్టు చూపిస్తూ. రామారావు తన స్కూటర్ని యింతవరకు ఎవ్వరికీ యిచ్చినట్టు నేను వినలేదు. చూడలేదు ఎవ్వరైనా అడిగితే (ఖర్మకాలి) పెట్రోల్ నిండుకుందనో, టైర్లలో గాలి లేదనో, బ్రేకు సరిగా పడటంలేదనో చెప్తూనే మా యింటి వైపు చేయి చూపించి నట్టు దాఖలాలు వున్నాయి. ఆఫీసుకు మాత్రం తరుచూ సైకిలే వాడతాడు

"బాలూగారూ! ఇక వెళ్ళి పడుకోండి. అన్నిటికీ భగవంతుడున్నాడు. మీ స్కూటర్ కేమీ కాదు" అంటూ ధృఢంగా చెప్పి నా భుజమ్మీద చేయి వేశాడు మాట వినికపోతే ఇంట్లోకి గెంటేలా వున్నాడు

"ఏమయితే అది అవుతుందిలే" అని నేను కూడా మొండిగా కదిలి కళ్ళు మూసుకు పడుకొన్నాను అప్పటికి ఐదు అయినట్లుంది. ఇంకో ఐదునిముషాలు గడిచాయి

'బజర్' మోగుతోంది వినగ్గా తలుపు తీసి చూశాను. ఎదురుగా రామారావు నిలబడి వున్నాడు. లైటు వేశాను

"ఏమయింది?"

మనిషి బాగా కంగారు పడుతున్నాడు, ముఖమంతా చెమట పట్టింది.

"బాలూగారూ! మీ స్కూటర్ మా యింట్లో వుంది. మీ దాంట్లో పెట్రోల్ లేదని, మీ బండి మా యింట్లోనే వుంచేసి, మా పిచ్చిదాన్నడిగి (వాళ్ళావిడకు మరోముద్దు పేరు) నా స్కూటర్ని తీసుకెళ్ళాడట. అయ్యో! ఇదీ సంగతి రోడ్డు బాగోలేదు. ఏదయినా ఆక్సిడెంట్ జరిగితే!..." అంటూ వాగేస్తున్నాడు రామారావు.

"ఏం కాదండీ! మీరేం భయపడనవసరం లేదు. విస్సు ఎంత జాగ్రత్తగా బండి నడుపుతాడో మీకు తెలుసు కదా? అన్నిటికి భగవంతుడున్నాడు" అంటూనే మొదలెట్టే సరికి, కోపంగా నావైపు చూస్తూ వడివడిగా బైటికి నడిచాడు. రామారావుకు ధైర్యం చెప్దామని ఆయన వెంట వెళ్ళబోయాను. కాని అప్పటికే వీటో దూరంగా వెళ్తున్నట్టు కనిపించింది. సరేలే! అనుకుని తలుపుమూసి మళ్ళీ పడక మీద పడ్డాను

'బజర్' మోగుతోంది...

తలుపు తీసి చూశాను కదా! ఎదురుగ్గా సుబ్బారావు, జాన్సన్ శాస్త్రీ...

"సుబ్బారావు అర్జంటుగా నాగపూర్ వెళ్ళాలట...జి. టి కెళ్దామనుకుంటున్నాడు. ఓసారి నీ స్కూటరిస్తే" అంటూ జాన్సన్ శాస్త్రి, సుబ్బారావుకు వకాల్తా పుచ్చుకొని...

నా కుడిచేతిని రామారావు యింటి వైపు చూపిస్తూంటే సుబ్బారావు, శాస్త్రీ నన్ను పిచ్చోడిలా చూస్తూ నిలబడిపోయారు .. అర్థంగాక ...

టాప్ స్టార్ ఉన్న
కప్పు ఏది?



చూడండి, ఇక్కడ
చిక్కని, కమ్మని టీ ఉన్నది

## చూడగానే తెలుసుకుంటారు దాని గొప్పదనం
## రుచిచూడగానే గ్రహిస్తారు దాని కమ్మదనం

చిక్కదనపు పరీక్ష...చేసి చూడండి...టాప్‌స్టార్ అన్ని టీకన్నా మెరుగు...మరే ఇతర టీకన్నా చిక్కనిది — చిక్కదనంలో టాప్, కమ్మదనంలో టాప్.

ఎందుకంటే, ప్రత్యేకమైన భారతీయ తేయాకుల తాలూకు ఘాటైన (స్ట్రాంగ్) సమ్మేళనం నుంచి తయారైంది లిప్టన్ టాప్‌స్టార్... సంతృప్తి నిచ్చే చిక్కని, కమ్మని టీ కోరుకునే వారి కోసం!

# లిప్టన్ టాప్ స్టార్ టీ

చిక్కదనంలో టాప్, కమ్మదనంలో టాప్




LINTAS-LTS. 6-2315 TL.

# ★ వారఫలం ★

**27-11-1981 శుక్రవారం మొదలు 3-12-1981 గురువారం వరకు**

మేషం వ్యాపార రంగంలో, వ్యవహార విషయాలలో అధికారుల వలన జరుగవలసిన వ్యవహారాలలో, 'అశ్వని' నక్షత్రకులకు మేలున్నది వ్యాపారమార్పులు సత్ఫలదాయకాలు రాశ్యాధిపతి అనుకూలుడవటం చేత, భారీ వ్యాపారంలో చెప్పదగిన అవకాశాలుంటాయి. స్త్రీలకు అన్ని రంగాలలో వృద్ధిగలదు.

వృషభం మీకు వ్యాపారరీత్యా, వ్యవహారరీత్యా, నూతన వస్తు సేకరణ రీత్యా అనుకూలత గలవారం. భూములు కొనే ప్రయత్నం కొందరు, నూతనవస్తు సేకరణ గావించటం కొందరుకు అనుకూలం. — స్త్రీలకు కుటుంబానందం, వయసు వచ్చిన వారికి శుభ ప్రయోజనాలకు అవకాశం, ఉద్యోగ ప్రాప్తి కొందరకు గమనింపదగిన అంశాలు.

మిధునం ధనాదాయమున్నది. శ్రద్ధతో వ్యవహారం పరిష్కారం కాగలదు క్రయ విక్రయాలలో లాభించే మార్గమున్నది. ఉద్యోగంలో చాల మందికి 'ప్రమోషన్' లభించే మార్గమున్నది. యోచనతో గావించిన పనులు సుకరంగా నెరవేరనున్నవి బంధుప్రీతికి ఆకరమైన వారం స్త్రీలకు కళాసాహిత్య రంగాలలో, క్రీడావనిలో మేలు జరుగనున్నది.

కర్కాటకం వైద్య వృత్తిలో, 'ఇంజనీరింగు' వ్యవహారాలలో, రచనా వ్యాసంగంలో మీకు మేలు జరుగనున్నదని గ్రహించాలి ఆదాయం సంభవమయ్యే దినాలలోనే నష్టం రానున్నది మిత్రద్రోహం సంభవింపనున్నది జాగ్రత్త! స్త్రీలకు! రచనా వ్యాసంగం ఫలింపనున్నది సుఖశాంతులుకు ఆకారమున్నవారం

సింహం రచనా వ్యాసంగం ఫలించటం, కొందరకు క్రయవిక్రయాలలో లాభించటం, వ్యాపారంలో నూతన మార్గాలు లభించటం, రాజకీయంగా మేలు జరగటం, క్రీడావనిలో కొందరకు అనుకూలత కల్గటం, సుఖశాంతులు సంభవించటం చెప్పదగిన అంశం స్త్రీలకు ముఖ్యరంగాలలో, ముఖ్యవృత్తులందు, ఉద్యోగంలో లాభించటం జరుగుతుంది.

కన్య దూర ప్రాంతాల నుండియో, బంధువులనుండియో, మిత్ర వర్గాన్నుండియో, అధికార, అనధికార వర్గాన్నుండియో, శుభవార్తా శ్రవణం ఉంటుంది ధనలబ్ధి గలవారం అయినా ఏడున్నర సంవత్సరాల శనిబాధ, రాశియందే శనిస్థితుడగుట చెప్పదగిన అంశాలు స్త్రీలకు ఆదాయం, అభివృద్ధి, ఉద్యోగప్రాప్తి కొందరకు చెప్పదగిన ముఖ్యాంశం. ఆరోగ్య లోపంలేని వారం గ్రహించండి శ్రమించండి

తుల దూరప్రాంతాల నుండి అనుకూలమైన వార్తలు వింటారు సుఖ శాంతులుండగల వారం. మంచి వార్త ఏదో ఒకటి విన గలుగుతారు. మధ్యవర్తిత్వ పరిష్కారానికి అనుకూలత చేకూరనున్నది. అయినవారి సంబంధాన్ని గూర్చి తాపత్రయ పడగలరు, గాని ప్రయోజన ముండదు స్త్రీలకు — ఉద్యోగ వృత్తులందు సర్వానుకూలం

వృశ్చికం ఆదాయం గలవారం. బంధువులతో, మిత్రులతో గోష్ఠి సలుపనున్నారు. ఆహార విహారాదులలో మాత్రం ఎంత జాగ్రత్తగా ఉంటే అంత మంచిది వ్యాపార విషయకంగా దూరప్రాంతాలకు ప్రయాణించనున్నారు. స్త్రీలకు నూతన ప్రయత్నాలు ఫలించటం, నూతన వార్తా శ్రవణానికి అనుకూలత, లబ్ధిగలవారం.

ధనుస్సు సులభంగా జరుగవలసిన వ్యవహారాలు మీకు ఎదురు తిరిగే అవకాశమున్నది విందు వినోదాల నిమిత్తమై కాలం వ్యయించనున్నారు చాల మందికి పత్రికా గౌరవం, సభాగౌరవం చేకూరనున్నది. వయసువచ్చిన బాలబాలికలకు శుభకార్యాలు కూడిరాగలవు. స్త్రీలకు వృత్తిలో అనుకూలత, కుటుంబ వ్యవహారాలలో చిక్కులువిడివడుట, సుఖశాంతులుండుట గమనింపగలరు.

మకరం ఆదాయం గలవారం. అనవసరంగా పేచీలు రాగల అవకాశమున్నది స్వార్థంకొంచెం వదులుకొని, పరులకు సాయపడుట మీ వృత్తిగదా! చాల వ్యవహారాలలో దిగే ప్రయత్నం మానుకోవటం, ఎంతైనా అవసరం. ఉద్యోగంలో కొందరు 'ప్రమోషన్లు' ఆశింప గల్గటం, కొందరకు అనుకూలం గావటం గ్రహింపగలరు. స్త్రీలకు అన్నిరంగాలలో అభివృద్ధిని సూచింప గలవారం.

కుంభం సుఖశాంతులుండగలవు. తలచినపనులు నెరవేరే సమయం వ్యాపార విషయంలో అంటే, క్రయ విక్రయాలలో అవకాశం లభించే మార్గమున్నది. చాలమందికి ఉద్యోగవృత్తులలో అనుకూలం, కించిత్తు ధనలాభం గలవారం. స్త్రీలకు: వెనుకు ముందు లాలోచించి, పరుల వ్యవహారాలలో జోక్యం పుచ్చుకోవాలి. వృత్తిలో అభివృద్ధికి అవకాశం గలవారం.

మీనం. దూర ప్రాంతాల నుండి అనుకూల వార్తలు వినటం, అయినవారి సంబంధానికై ప్రయత్నించటం, కోర్టు వ్యవహారాలు ఏమైనా ఉంటే అనుకూలత సాధింపబడటం, నూతన వ్యవహారాలు తెలిసి కొన్నందున ముమ్ముందు లాభించగలదని గ్రహించటం ఈ వారం జరుగుతుంది స్త్రీలకు సుఖశాంతులు, కుటుంబానందం, కొందరకు రాజకీయంగా అనుకూలత సంభవించటం జరుగుతుంది.

— విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

# ప్రశ్నావళి

—కె. రామలక్ష్మి

**షణ్ముఖ – సునాబేడ**

అగ్నిసాక్షిగా వివాహమాడిన అర్ధాంగిని వదిలి, మగువల మత్తులో అహోరాత్రులు మునగడమేనా నేటి ఆచారం?

ఆచారంకాదు తిమ్మిర్లు

తల్లిదండ్రుల కట్టడివల్ల ఎన్ని కుటుంబాలు కూలిపోతున్నాయో, ఎంతమంది ఆదర్శప్రేమికుల ఆశలు అడియాశలై పోతున్నాయో — కొందరికి మాత్రమే తెలుసు.

దీన్నే ఆడలేక మద్దెల వోడనడం! కట్టడి లేక జులాయిగా తిరిగి చెడిపోయేవాళ్లు ఉన్నారు. ఆదర్శ ప్రేమను కాస్త బాబోయ్ అమ్మో నాన్నో అంటూ గంగలో కలిపేసే అమ్మాయిలూ అబ్బాయిలూ ఉన్నారు వయసుకు తగని ఆలోచనలు పెంచుకుందుకు దోహదం చేస్తూ సినిమాలు ఉన్నాయి. నవలా సాహిత్యం ఉంది ఇరుగూ పొరుగూ ఉన్నారు.... బాధ్యతలు తప్పించుకొందుకు— వంకలే దొరకవా? ... క్రమశిక్షణ పిల్లల మంచికోసమే గాని వాళ్ల పరాజయం కోసమే నని ఎందుకనుకుంటారు?

**డి. ఎ. ఆర్. - రిటాంగ్ కోలనీ**

నేటి యువతులు మోహన్‌బాబు లాగా ఉంటే ప్రేమిస్తారా? లేక శోభన్‌బాబులాగా ఉంటే ప్రేమిస్తారా?

ఒట్టి అప్పారావులాగా ఉన్నా ప్రేమిస్తారు — వ్యక్తిత్వం ఉంటే!

**రామ్ – హైదరాబాదు**

ఏ ఇతర కులంవాళ్లు సంఘం స్థాపించినా తప్పులేదు. గాని బ్రాహ్మణులు స్థాపించుకొంటే తప్పా? అన్నారు ఒకరు. తప్పుచేస్తే నేనూ చేస్తా నన్నట్టుంది.

పిల్లిని కూడా కార్నర్ చేస్తే తిరగబడుతుంది ఆత్మరక్షణ కోసం. బ్రతికి ఉండడం కోసం, గౌరవంగా బ్రతకడం కోసం— బ్రాహ్మణులు చేస్తున్నది ఇంతే. ప్రభుత్వంమమ్మల్ని మైనారిటీ గ్రూపుగానో బి. సి. గానో గుర్తించేస్తే గొడవేమీ లేదు— మామా పిల్లలు యీ కులంలో పుట్టినందుకు ఖిన్నపడనక్కరలేదు.

**మణి – ఉరవకొండ**

మరలా రామరాజ్యం వస్తే, సీత అగ్నిపరీక్షకు ఒప్పుకోదని నా అనుమానం.

అందుకే రామరాజ్యం రాకుండా కష్టపడడం. నాకు పౌరాణిక ముకుటాలు, చెవులూ కోయించడం కూడా ఇష్టంలేదు. ఇప్పుడంతకంటే బారువాలే జరుపుతున్నారనుకోండి!

**జె. ఎస్ – యలమంచిలి**

స్త్రీ జీవితంలో ఒక్కరినే ప్రేమిస్తుందంటారు. ప్రస్తుత స్త్రీల మనోభావాలను బట్టి యిది ఎంతవరకు నిజం.

అంటే మోసం చేసిన వాడిని మరిచిపోయి — మళ్లా పెళ్లి చేసుకుంటున్నారనా ఆడవారి— మనోభావాలు మారాయని అనుకుంటున్నారు. కాస్త ఆ మాత్రం ధైర్యం చూపెడుతున్నందుకు మనం ఆనందించాలి!

**పి. ఎస్ బి. – హైదరాబాదు**

చిలికి చిలికి గాలివానగా మారుతున్న సంసారాలకు మీరిచ్చే సలహా?

భార్యాభర్తలు— కూర్చుని మాట్లాడుకోగలగాలి. అసలు ఇద్దరు వ్యక్తుల మధ్య కమ్యూనికేషన్ గాప్ ఏర్పడితేనే— అనర్థాలన్నీ వస్తాయి. ఆలోచించి చూడండి ఎన్ని సంసారాల్లో ఎంతమంది భార్యాభర్తలు ఏమి మాట్లాడుకొంటున్నారో పెళ్లయిన కొంత కాలానికే — ఏమి మాట్లాడుకోందకు ఉండదనుకొంటారు. మగవాళ్లు ఏం మాట్లాడాలీ అనుకుంటారు. ఎంత సేపూ కొంప గురించి పిల్లల కొంప గురించే గానీ, వారి గురించి మాట్లాడుకునే జంటలు ఎంతమంది? కొందరు మగాళ్లు మాట చెప్పడమే ఆర్డరు వేసినట్లు ఉంటుంది. కొందరు దెప్పినట్లు, ఎద్దేవా చేసినట్లు, కించపరచినట్లు, వోముద్దుతో మాట్లాడినట్లు భార్యలతో మాట్లాడతారేగాని సాటి మనిషితో మాట్లాడినట్లుగా ఉండదు. సంసారాలు కుదురుగా సాగాలంటే— ఇద్దరి మధ్యా అపారమైన గౌరవాభిమానాలేకాదు, వోర్పు నేర్పు కూడా ఉండాలి అందుకే సంసారం అంటే ఆషామాషి కాదనడం.

**యు. టి. – విజయవాడ**

ఆడదానికి ఆభరణం ఏడుపు? మగవానికిఆభరణం?

ఆమెని చూసి ఏడవటం కాదా!?

**కె. ఆర్. ఆర్. – అత్తివరం**

ప్రేమ, పెళ్లి రెండూ రెండక్షరాల మాటలే. వాటి తేడాను కూడా రెండక్షరాలలో చెప్పండి.

**వ్యథ! ప్రేమలో వుంటుంది. పెళ్లితో రెండింతలవుతుంది!!**

**మధు – మాసెపల్లి**

అందమైన ఆడవాళ్లను చేసుకున్న మగవారికి మీరిచ్చే సలహా?

నమ్మకం పెంచుకోండి—మీ భార్యల మీద. అనవసరపు అనుమానాలతో వారి జీవితాలను అంధవిహీనం చేయకండి— అని.

# కవితాగానం చేసే కళ్లకు...

# ఐటెక్స్

అపురూప సౌందర్యంతో పొంగిపోయే
యవ్వనంతో మురిపించే వనితల వదనాలను
ఆకర్షించే అతివల కళ్లను, ఆనందంగా
కొనచూపులతో నటనమాడించేది ఐటెక్స్
శాస్త్రీయ విధానంలో తయారుచేయబడు
ఐటెక్స్ కాటుక అందాలు చిందేటి
యువతుల కళ్లను దోషమేమీ చేరనీయక
చల్లగా కాపాడుతుంది...

## చూపులనే మాటలుగా మార్చే ఐటెక్స్




**ఐటెక్స్** 38 సంవత్సరములుగ మీ నమ్మకానికి
పాత్రమైన ఉన్నతమైన చిహ్నం

అరవింద్ లాబొరేటరీస్ మద్రాసు 600033

సీరియల్

# జీవితవనంలో కొత్తగాలి

కుందుర్తి ఇందిరాదేవి

(గత సంచిక తరువాయి)

"సంధ్యా" ప్రమీల నా అరచేతిలో గిల్లటంతో చప్పున స్పృహలోకి వచ్చాను

"మైగాడ్! సంధ్యా! నీ కళ్ళల్లో నీళ్ళేమిటి?" ప్రమీల ఆదుర్దాగా అంది ఓహ్! నిజమే నా కళ్ళు చెమ్మగిల్లి ఉన్నాయి చప్పున తుడిచేసుకున్నాను

"ప్రమీ! ఏమో! నా బుర్ర పనిచేయటం లేదు నాకేమిటో భయం వేస్తోంది ఏంచేయాలో నువ్వే చెప్పు" అన్నాను తడబడుతూ

"నీ బుర్రే ఒట్టిపోతే, ఇక నా బుర్రలో ఏం ఆలోచనలు ఉంటాయి అయినా నేనేం పరిష్కారం చెప్పగలను" జాలిగా అంది ప్రమీల

"నాకు! నాకు ఇటువంటి విషయాలు తెలియవు ప్రమీ! నాన్నగారు నాకు ఇటువంటి బాధ్యత అప్పగించలేదు నేను నేనెప్పుడూ వీళ్ళ పెళ్ళి గురించి ఆలోచించలేదు" గాభరాగా అనేశాను

"మరి" ప్రమీల తెల్లబోయినదానిలా చూసింది

"నిజం ప్రమీ! నాకెంతసేపు వీళ్ళకి ఎలా ఫీజులు కట్టటమా? బట్టలు ఎలా కొనటమా? వీళ్ళందరికీ కడుపునిండా తిండి ఎలా పెట్టటమా? ఎలా ఈ అప్పులు తీర్చటమా? ఎప్పుడు బాధ్యత తీర్చుకోవటమా? అనే ఆలోచించానేగానీ, వీళ్ళ పెళ్ళిళ్ళ గురించి నాకు ఈ నిముషం వరకూ ఆలోచనలేదు ప్రమీ!" వణుకుతున్న స్వరంతో అన్నాను

"ఏమిటీ! అయితే వాళ్ళకు పెళ్ళిళ్ళు చెయ్యాలనే ఆలోచన నీకు లేదా అసలు" ప్రమీల నిర్ఘాంతపోయింది

నేను తల ఆడిస్తూ "నో! నో! నా ఉద్దేశ్యం అది కాదు వాళ్ళు చదువుకుని ఉద్యోగాలు చేసుకుంటే, కట్నం లేకుండా ఎవరైనా చేసుకుంటారు అని ఒకసారి అమ్మ అంది నేనుకూడా అదే అనుకుని అస్సలు ఆ విషయం ఆలోచించనేలేదు" డగ్గుత్తికతో అన్నాను

అర్థమైందన్నట్టు చూసింది ప్రమీల! తర్వాత మెల్లిగా నా చేతిని నిమురుతూ "సంధ్యా! వయసనేది వరదలాంటిది దానికి పెళ్ళితో అడ్డుకట్ట వెయ్యాలి ఉరకలువేసే యవ్వనంలో ఉచితానుచితాలు ఏమీ తెలియవు సంధ్యా! ఇప్పుడు నువ్వు శశిని తిట్టినా లాభంలేదు దగ్గర కూర్చోబెట్టుకుని మెల్లిగా నచ్చచెప్పు" ప్రమీల ఆరిందాలా అన్నది

"ఎలా చెప్పాలి?" విస్మయంగా అన్నాను

"అది తప్పు! కూడదు పరువుప్రతిష్ఠ అని ఓ హద్దులు ఉన్నాయి – అని ఇలాగే చెప్పు నీకు తోచింది" ప్రమీల సలహా ఇచ్చింది

"ఏమో ప్రమీ! నా మాట వింటుందన్న నమ్మకమేమిటి?" దిగులుగా అడిగాను

"వినక ఏం చేస్తుంది? అందులో పెద్దదానివి నువ్వుండగా తను ఎలా పెళ్ళి చేసుకుంటుంది" అని అనునయించింది

ఎప్పుడు చీకటి పడిందోకూడా నేను గమనించలేదు అప్పుడే లైట్లు వెలుగుతున్నాయి ఆకాశంలో నక్షత్రాలు సామాన్య మానవుని ఆశల్లా మిణుకు మిణుకుమంటున్నాయి

ఇద్దరం లేచాము ఉన్నట్టుండి ప్రమీల నా చేతిని తన చేతిలో బిగించి పట్టుకుంటూ "సంధ్యా! భయపడకే! శశి నీ మాట తప్పకుండా వింటుంది! నాకా నమ్మకముంది" అంది దృఢ స్వరంతో

"నువ్వే అన్నావు, వయసు వరదలాంటిది! ఉరకలువేసే యవ్వనంలో ఉచితానుచితాలు తెలియవని నా మాట ఎందుకు లక్ష్యపెడుతుంది! నమ్మకమేమిటి?" భారంగా అన్నాను

ప్రమీల చప్పున సమాధానం చెప్పలేదు నేనే అన్నాను –

"ప్రమీ! జలసాగా తిరిగే నీకు ఇంతవరకూ ఎవరితోనూ పరిచయం కాకుండా ఉంటుందంటావా" అన్నాను

ప్రమీల ఫక్కున నవ్వి "ఊహూ! అమ్మాయి గారి బుర్ర పూర్తిగా ఆబ్సెంట్ అయి ఉంది ప్రస్తుతం" అంది

నేను చిరుకోపంగా చూశాను

ప్రమీల ఇంకా నవ్వుతూ తన ఉంగరపు వేలిని నా ముందు ఆడిస్తూ "మా బావ అమెరికాలో ఉన్నాడు, మర్చిపోయావుటోయ్" అంది

నేను చప్పున నాలిక్కొరుచుకున్నాను "ఓ సారీ" అన్నాను ప్రమీలకు రెండేళ్ళ క్రితమే అంటే బి ఏ అయిపోగానే వాళ్ళబావతో ఎంగేజ్‌మెంట్ జరిగింది పెళ్ళి మాత్రం అమెరికా నుండి వచ్చిం తర్వాత చేసుకుంటానని పేచీపెట్టటంతో దాన్ని వాయిదా వేశారు ఎంతయినా ప్రమీల అదృష్టవంతురాలు నేను నిట్టూర్చాను ఇద్దరం బస్ స్టాప్‌లో నిలబడ్డాము ఉన్నట్టుండి ప్రమీల అంది–

"సంధ్యా! మనిద్దరం ఒకే వయసు వాళ్ళం కదా! నీకెప్పుడూ పెళ్ళి చేసుకోవాలనే ఊహ రాలేదా"

నేను చప్పున సమాధానం చెప్పలేకపోయాను నిండా పీకలవరకూ కుటుంబ బాధ్యతలలో, అప్పుల్లో మునిగిపోయిన నాకు పెళ్ళేమిటి? నా మొహం!

"నువ్వు ఎన్నడూ ఆలోచించలేదా?" ప్రమీల రెట్టించింది

"ఊహూ"

"అబద్ధం"

"వచ్చింది కానీ అది ఏ రూపంగానో తెలుసా" అన్నాను

"వచ్చిందా!" అంది ఉత్సాహంగా

"అవును! నా బాధ్యతలన్నీ ఎప్పుడు వదిలిపోతాయో ఆ క్షణమే స్వేచ్ఛా జీవిలా, పక్షిలా ఆకాశంలోకి ఎగిరిపోవాలని " ప్రమీల మధ్యలోనే ఆపేసింది

"ఛ! ఛ నేను నీ పెళ్ళి గురించి అడుగుతున్నాను నీ బాధ్యతల గురించి కాదు"

"అదేమిటోయ్ మిత్రరత్నమా, అంతలోనే కోపం తెచ్చేసుకున్నావు" నవ్వాను

"ఛట్" ప్రమీలకి కోపం వచ్చింది

నేను గంభీరంగా అన్నాను, "నాకున్న అప్పులు నాకు మొగుడితో సమానం నాకున్న బాధ్యతలు నా పిల్లలతో సమానం"

ప్రమీల పకపకా నవ్వుతూ "అయితే నువ్వు రాత్రిళ్ళు కలలు కనేది ఇలాంటి మొగుడు – ఇలాంటి పిల్లల కోసమేనా" అంది

**జరిగిన కథ – 4 :** పోతూ పోతూ ఆ కుటుంబ భారంతోపాటు చేసిన అప్పు కూడ పెద్దకూతురైన సంధ్యపై వేసి కన్నుమూస్తాడు ఆమె తండ్రి ఓ చిన్న ఉద్యోగం చేస్తూ తల్లితో పాటుగా తమ్ముణ్ణి, ముగ్గురు చెల్లెళ్ళను పోషిస్తూ వాళ్ళకి చదువు సంధ్యలు చెప్పిస్తుంటుంది ఎప్పుడైనా డబ్బు అవసరమైతే తన స్నేహితురాలు ప్రమీల దగ్గర తెచ్చుకుని మళ్ళీ ఇచ్చేస్తుంటుంది ప్రమీల అన్న కిరణ్‌తో సంధ్య స్నేహం చిగుళ్ళు తొడుగుతూంటుంది ప్రమీల పుట్టినరోజు పార్టీకి సంధ్యా, కిరణ్‌లు వెళతారు, ఆమె ఆహ్వానించగా పార్టీ పూర్తయిన తర్వాత తన స్కూటర్‌పై సంధ్యను వాళ్ళింటి దగ్గర దించి వెళతాడు కిరణ్ సంధ్యకు దగ్గర కావాలనే ఉద్దేశ్యంతో కిరణ్ చేసే పనులు ఆమెకు ఆశ్చర్యాన్ని కల్గిస్తాయ్! శశి ఎవరో అబ్బాయితో తిరుగుతుండగా చూసిన ప్రమీల చెప్తేగాని తన కర్తవ్యం ఏమిటో గుర్తుకు రాలేదు సంధ్యకి

నేను నవ్వాను ప్రమీల చప్పున నవ్వాపేసి –

"నిజం చెప్పు సంధ్యా! నీకు పెళ్ళి ఎప్పుడవుతుంది నీ ఈ బాధ్యతలు వదిలిపోయేసరికి నువ్వు ముసలిదానివి ఉవుతావు అప్పుడు నిన్ను ఏ పడుచు కుర్రాడు పెళ్ళి చేసుకుంటాడు" అంది ప్రమీల గొంతులో లీలగా బాధ, కోపం ధ్వనించాయి నేను నవ్వుతూ ప్రమీల మాటల్ని ఎగరగొట్టాను

"నాకన్నా ముసలివాడిని చేసుకుంటాను అప్పుడు నేను పడుచుదాన్నేగా!"

ప్రమీల, నేనూ నవ్వుకున్నాము

నేను వెళ్ళాల్సిన బస్ రావటంతో ఎక్కేశాను ప్రమీల చెయ్యూపింది

బస్ దిగంగనే నా ఆలోచనలు మళ్ళీ శశిమీదికి మళ్ళాయి గుమ్మంలో అడుగుపెట్టాను ఉష కూనిరాగాలు తీస్తూ పత్రికలో బొమ్మలు చూస్తోంది ఫల్గుణ చదువుకుంటున్నాడు పక్కనే మీనా కూర్చుని లెక్కలు చేసుకుంటోంది అమ్మ లోపల ఏదో పనిలో ఉన్నట్టుంది నా కళ్ళు ఆత్రంగా శశికోసం వెతికాయి రేడియోపెట్టే టేబుల్ పక్కగా క్రింద కూర్చుని రికార్డు రాసుకుంటోంది ఉషకి చదువుమీద శ్రద్ధ తక్కువ కానీ మిగతా అందరూ శ్రద్ధగా చదువుతారు శశి మొదటినుండి క్లాసులో ఫస్ట్ మార్కులు తెచ్చుకుంటోంది తన కాళ్ళమీద తను నిలబడాలి అనే ఆశయం ఉన్న వ్యక్తి తలవంచుకుని సీరియస్‌గా వ్రాసుకుంటున్న శశిని నేను మొట్టమొదటిసారిగా చూస్తున్నట్టు చూడసాగాను నిర్మలంగా, అమాయకంగా ఎంతందంగా ఉందా ముఖం! ఇటువంటి ఆడపిల్లలు ప్రేమలోపడితే తర్వాత వాళ్ళ గతేమిటి? అందులో నాకు మొదటినుండి ప్రేమలంటే నమ్మకం లేదు కూనిరాగాలు తీస్తున్న ఉష పత్రిక చేత్తోనే లేచి -

"ఓ! మై గాడ్! జనరంజని వచ్చే టైమైంది" అంటూ రేడియోవైపు రాబోయింది ఆ మాటలు వినంగానే శశికి కోపం వచ్చి ఏదో అనబోయి తలెత్తిందల్లా ఆగిపోయింది ఉష చేతిలోని పత్రిక మెల్లిగా టేబుల్‌మీద పెట్టేసింది అందరూ హఠాత్తుగా ఏర్పడిన నిశ్శబ్దానికి తలెత్తారు నేను నిశ్చలంగా నిలబడి శశిని తదేకంగా చూస్తుండటంతో అది ఇబ్బందిగా కదిలి,

"అదేంటక్కా! అక్కడే నిలబడ్డావు" అంది

నేను గట్టిగా నిట్టూర్చి పక్కగదిలోకి వెళ్ళిపోయాను ఉష పిల్లిలా క్లాసు పుస్తకం చేతిలోకి తీసుకుంది

ఆ రోజు భోజనం చేస్తున్నా, నిల్చున్నా, కూచున్నా నా చూపులు శశిని వెంటాడుతునే ఉన్నాయి

యథాలాపంగా అన్నట్టు అడిగాను –

"ఏమిటమ్మా విశేషాలు?"

అమ్మ ఆశ్చర్యంగా చూసి "ఏమీ లేవే!" అంది

"ఊహూ! ఈ రోజు ప్రమీల ఆఫీసుకి వచ్చింది అందుకే ఆలస్యమైంది" శశినే చూస్తూ అన్నాను

శశి కళ్ళు రెపరెప లాడినాయి ఆ కళ్ళల్లో భయం, అనుమానం లీలగా కదిలాయి అది నా దృష్టిని దాటిపోలేదు అయితే శశి నిజంగ ప్రేమలో పడిందా? ఏమో! ఆ రాత్రి చప్పున నాకు నిద్రపట్టలేదు ప్రమీల పొరపడిందేమో! అమాయకంగా ఉండే శశికి ఇంత ధైర్యం ఎక్కడి నుండి వస్తుంది? నిజం ఎవరో ఒకరు తెలిసిన వ్యక్తి కావచ్చుగ! తెలిసిన వ్యక్తి అయితే సినిమాకి ఎందుకి వెళ్ళాలి? నా మనసు నిలదీసింది

నాకు నిద్రపట్టక మంచంమీద దొర్లుతున్నాను నాకేం చెయ్యాలో తెలియటంలేదు కిటికీలోంచి వెన్నెల పల్చగా నా మంచంమీద పడుతోంది సన్నటి గాలికి సన్నజాజుల పరిమళం తేలివస్తోంది అంతా నిశ్శబ్దంగా ఉంది టిక్కుటక్కుమని గడియారం శబ్దం వినిపిస్తోంది "నీకెప్పుడూ పెళ్ళి చేసుకోవాలని ఊహ రాలేదా?" ప్రమీల మాటలు గుర్తొచ్చాయి నేను అశాంతిగా రెండు చేతుల్లోను మొహం ఉంచుకుని కిటికీలోంచి శూన్యంలోకి చూడసాగాను

## 9

మర్నాడు -

నేను కావాలనే మా ఆఫీసు దగ్గర బస్ ఎక్కకుండా కోఠీ సెంటర్‌కి వచ్చాను విమలతో కోఠీ రాగానే విమలని వెళ్ళిపొమ్మన్నాను విమల ముందు ఆశ్చర్యపోయింది కారణం మా ఆఫీసు దగ్గర బస్ ఎక్కితే మా ఇంటిదగ్గర స్టాప్‌లో









దిగిపోవచ్చు. కానీ నేను ప్రమీల మాటలను గుర్తు పెట్టుకుని కోఠీ వచ్చాను ఈ కోఠీ సెంటర్‌లోనే శశి కనిపించిందని చెప్పింది నా కళ్ళతో చూడందే ఏదీ నమ్మరాదనే నిశ్చయానికి వచ్చి ఇక్కడికి రావటం జరిగింది విమల అయిష్టంగానే వెళ్ళి పోయింది

బస్‌లు వస్తూనే ఉన్నాయి కానీ ఒక్కటీ ఆగటంలేదు నా కళ్ళు చుట్టుప్రక్కల గాలిస్తూనే ఉన్నాయి కాసేపటికి నాకు విసుగురాసాగింది ఈరోజు కనిపించాలనే ఏముంది? నేను టైం చూసుకున్నాను ఊహు! శశి ఈపాటికి ఇంటికి వెళ్ళిపోయి ఉంటుంది నేను వెయిట్ చెయ్యటం అర్థంలేని పని అందుకే బస్‌కోసం చూడసాగాను ఇదో వెధవగోల ఈ బస్‌లవెంట పరిగెత్తటం,వాటిని అందుకోవాలనే ప్రయత్నం, అందక నిస్పృహగా వెనక్కి రావటం...ఇదో థ్రిల్ రోజూను ఒకరకంగా చెప్పాలంటే ఇదో పరుగుపందెంలా ఉంటుంది నన్నడిగితే సగం జీవితం సిటీస్‌లో ఈ బస్‌లవెంట పరిగెత్తటంలోనే గడిచిపోతుందనిపిస్తుంది

బస్ కోసం విసుగ్గా చూస్తూ తల తిప్పబో బోయి హఠాత్తుగా ఆగిపోయాను దూరంగా స్కూటర్ దగ్గర నిలబడి ఎవరితోనో మాట్లాడుతూ సిగరెట్ తాగుతూ నిలబడ్డ వ్యక్తిమీద నా దృష్టి నిలిచిపోయింది కాసేపటికి అతను వెళ్ళిపోవటంతో కిరణ్ దృష్టి నావైపు పడింది నేను చివ్వున మొహం తిప్పేసుకున్నాను హఠాత్తుగా నా కంటి ముందు మెరుపు మెరిసినట్టయింది నేనలా మొహం తిప్పుకుని పక్కకి నిలబడ్డానోలేదో నా ముందునుండి రివ్వున ఒక స్కూటర్ దూసుకుపోయింది వెనక కూర్చుంది ఎర్రటి శారీపై పసుపుపచ్చ, తెలుపు డిజైన్ ఉన్న చీర మై గాడ్ శశి అక్షరాలా శశినే అతను ఎవరో? అంతకుముందు ఎన్నడూ చూసిన గుర్తులేదు ఓహ్ ప్రమీల చెప్పింది కరక్టే. శశి ప్రేమలో పడిపోయింది మై గాడ్! మై గాడ్! నాకు హఠాత్తుగా అంత గాలి వీస్తున్నా ఊపిరి ఆడనట్టుగా ఉక్కిరిబిక్కిరి అవుతున్నట్టుగా ఉంది నాకు చేతుల్లోనూ, మొహంమీద చెమటలు పట్టసాగాయి ఒక్క నిముషంలో ఏం జరుగుతోందో తెలుసుకోలేనంతగా నా బుర్ర మొద్దుబారిపోయింది అయోమయా

## జీవితవనంలో కొత్తగాలి

వస్థలో పడిపోయాను ఈ స్కూటర్‌మీద షికార్లు కొడుతుందంటే కాస్త ఉన్నవాడే అయి ఉండాలి భగవంతుడా! నాకేది దారి! భయం అనే ప్రవాహంలో కొట్టుకుపోతున్నాను హఠాత్తుగా నాముందు ఏదో స్కూటరాగిన శబ్దం అయ్యేసరికి ఉలిక్కిపడ్డాను

"హల్లో" అతను నవ్వుతూ పల్కరించాడు, కళ్ళకి ఉన్న కూలింగ్ గ్లాసెస్ చేతిలోకి తీసుకుని

నేను మాట్లాడలేదు కనీసం "హల్లో" అని తిరిగి విష్ కూడా చెయ్యలేదు ఏదో క్రొత్త వ్యక్తిని చూసినట్టు చూడసాగాను

"హల్లో! సంధ్యారాణిగారు! మిమ్మల్నే ఏమిటి నిద్రపోతున్నారేమిటి?" ఈసారి కిరణ్ మాటల్లో చిలిపితనం దోబూచులాడింది

నేను చప్పున మాట్లాడలేదు ఇంకా ఆ షాక్ నుండి తేరుకోనేలేదు కొంపలేవో అంటుకు పోతున్నట్టు 'హల్లో' అంటూ ఇప్పుడే ప్రత్యక్ష మైనాడు

అతను ఇబ్బందిగా కదిలాడు చుట్టుప్రక్కలవారి దృష్టి మావైపు ప్రసరించటంతో అతను స్కూటర్ స్టాండ్ వేసివచ్చాడు అప్పటికీ నేను మాట్లాడలేదు అతను నా ప్రక్కన నిలబడ్డాడు

"సంధ్యా" అతను ఈసారి నా చేతిమీద తట్టుతూ పిలిచాడు నేను తలెత్తి అతనివైపు చూశాను నా కళ్ళు అసహాయంగా అతనివైపు చూసినాయి అతను క్షణం నోటమాట రానివాడిలా చూశాడు తర్వాత మెల్లిగ "అలా ఉన్నారేం! ఒంట్లో బాగాలేదా" అన్నాడు నేను అప్పటికీ సమాధానం చెప్పలేదు అతను ఇబ్బందిగా చూసి "మీరెందుకో బాధపడుతున్నట్టున్నారు ఏమైనా షాకింగ్ న్యూసా" అన్నాడు నేను దానికీ సమాధానం చెప్పలేదు

"చూడు నువ్వు ప్రస్తుతం ఈ లోకంలో ఉన్నట్టులేవు ఎక్కడైనా కూర్చుందామా" అన్నాడు అక్కడున్న చమన్ నిండా జనం ఉన్నారు అతను విసుగ్గా నొసలు చిట్లించి ఆలోచనలో పడ్డాడు నా ఒంట్లో శక్తి అంతా లాగేసినట్టు, నా శరీరం అంతా చచ్చుబడిపోతున్నట్లనిపించ సాగింది ఇంకాసేపుంటే నిలుచున్నచోటే కూర్చుండి పోయేలా ఉన్నాను

అతను చిక్కుముడి విడిపోయినట్టు నావైపు తిరిగి –

"ఏదైనా హోటల్‌కి వెళదామా" అన్నాడు

నేను కళ్ళప్పగించి చూశాను వెడదాం అన్న మాట నాలుక చివరిదాకా వచ్చి ఆగిపోయింది అతను అప్పటికే నాలుగు అడుగులువేసి స్కూటర్ స్టార్టుచేసి – "రా" అని ఆహ్వానించాడు

నేను అర్థంలేని అయోమయస్థితిలో వెళ్ళి స్కూటర్‌మీద కూర్చున్నాను మరుక్షణం స్కూటర్ రివ్వున పోనిచ్చాడు ఇద్దరం వెళ్ళి ఫామిలీరూమ్‌లో కూర్చున్నాం

"ఏం తీసుకుందాం" అన్నాడు కిరణ్ పలకరిస్తూ నేనేం సమాధానం ఇవ్వలేదు

"టిఫన్ తీసుకుందామా! నీకు ఏవి ఇష్టం' అన్నాడు.

నేను తలెత్తి చూశాను అతనూ నావైపు చూశాడు ఇద్దరి కళ్ళూ కలుసుకున్నాయి

"పోనీ! ఒట్టి కాఫీ అయినా తీసుకుందామా?"

నేను రెండు అరచేతుల్లోను గడ్డాన్ని ఆనించుకుంటూ –

"ప్లీజ్! ఐ కాన్ట్ టేక్ ఎనీథింగ్ నౌ' అన్నాను

అతను వినలేదు "నువ్వలా అనకూడదు జస్ట్ ఫర్ కంపెనీ" అంటూ బేరర్‌ని పిలిచి రెండు కాఫీలకి ఆర్డరిచ్చాడు

## భౌతిక విశ్వానికి అతీతమైనది

మనిషికి మనిషి తిరుగాడ్డానికి పరిధులున్నాయి
జగతికి జగతిలో భౌతిక శరీరాలకు కక్ష్యలున్నాయి
శూన్యం అనబడే దానిలో వివిధ పొరలున్నాయి
పొర పొరకు మధ్య చెప్పకోదగిన తేడాలున్నాయి
పరిధి, కక్ష్య, అవధులు, భౌతిక సూత్రాలు,
పరిమాణాలు
కట్టుబడి ఉండనిదే ఉద్రేకభరిత ఊహాపూరిత
అస్థిత్వం

— "బజ్జు"

కాల్షియంలోపించిన ఎముకలు బలహీనంగా ఉంటాయి.
సులభంగా దెబ్బ తింటాయి.

# కాల్షియం-శాండోజ్
# ఎముకల నిర్మాణాన్ని బలపరుస్తుంది

ఎముకలు కంటికి కనిపించవు అయినా అవి మీ పిల్లల పెరుగు దలకు వికాసానికి అతిముఖ్యమైనవి కాల్షియం ఎముకలలోను, పళ్లలోను గల అతిముఖ్య పదార్థ భాగం కాల్షియం లోపం వల్ల ఎముకలలో బలహీనత పెళుసుతనం సంభవిస్తాయి పళ్లు వదులై చిల్లులు పడిపోతాయి

శక్తివంతమైన పళ్లకోసం, ఆరోగ్యవంతమైన ఎముకలకోసం మీ బిడ్డకి రోజుకు 3-4 వెనిల్లా వాసనగల కాల్షియం-శాండోజ్ బిళ్లలు ఇవ్వండి ప్రతి బిళ్లా కాల్షియంతోపాటు C, D, $B_{12}$, విటమిన్లతో పటిష్టం చేయబడింది

మీ బిడ్డడు ప్రతి రోజూ కాల్షియం కోల్పోతాడు అది తిరిగి సమకూర్చాలి లేకపోతే అతని పెరుగుదల దెబ్బతింటుంది మామూలు భోజనం కావల్సినంత కాల్షియం ఇయ్యలేక పోవచ్చు

**ఈ రోజే అతనికి కాల్షియం-శాండోజ్ ఇవ్వడం మొదలు పెట్టండి-ఎక్కువ ఆలస్యం అయిన తర్వాత ఎంత కాల్షియం యిచ్చినా కాల్షియం లోపంవలన కలిగిన హానిని మరమ్మతు చేయటం సాధ్యం కాదు.**

గుర్తుంచుకోండి అన్ని కాల్షియం బిళ్లలు ఒకటేకావు

**కాల్షియం—శాండోజ్ మాత్రమే కావాలని అడగండి. మారుగా యిచ్చే ఏ యితర వాటితోను సరిపెట్టుకోకండి.**

కాల్షియం-శాండోజ్— స్విట్జర్లండులోని శాండోజ్ వారిచేత పెంపొందించ బడిన అత్యుత్తమమైన కాల్షియం



**గట్టిపళ్లు, పటిష్టమైన ఎముకల కోసం కాల్షియం-శాండోజ్®**




daCunha/S 25 Rev/TL

నేను విస్సహాయురాలిలా టేబుల్‌మీద తల వాల్చుకున్నాను నా కళ్ళనుండి ఎంత బలవంతాన ఆపినా రెండు కన్నీటి బిందువులు జారి టేబుల్‌మీద పడ్డాయి శశి విషయం ఏంచెయ్యాలో తోచనిదానిలా అయిపోయాను అతను ఉన్నట్టుండి బేరర్‌ని పిలిచి మంచినీళ్ళు తెమ్మనటం వినిపించింది ఇదేమిటి! నేను ఇతనితో హోటల్‌కి ఎందుకువచ్చానో నాకే అర్థం కాలేదు

ఉన్నట్టుండి నా తలమీద చెయ్యి పడింది నేను ఉలికిపాటుగా తలెత్తి చూశాను. కిరణ్ చెయ్యి నా తలమీద, నా కళ్ళల్లో నీళ్ళు ఇద్దరం ఒక్క క్షణం అలా ఉండిపోయాం ఇద్దరిలో ఏ ఒక్కరికి చూపులు విడదీసుకునే ధ్యాసే లేకుండాపోయింది.

"సంధ్యా!" అతను ఎంతో ఆర్తిగా పిలిచాడు

మరుక్షణం నాకేమైందో నాకేతెలీదు చప్పున కిరణ్ చెయ్యి నా తలమీంచి లాగి అందులో మొహం దాచుకున్నాను ఎంత ఆపుకుందామన్నా నా కళ్ళల్లో నీళ్ళూరుతున్నాయి అతను చప్పున చెయ్యి లాగేసు కున్నాడు

సర్వర్ అక్కడపెట్టి వెళ్ళంగానే అతను బలవంతంగా నా మొహం పైకెత్తి "సంధ్యా" అన్నాడు

నేను చప్పున కర్చీఫ్ అందుకుని గట్టిగా కళ్ళు తుడిచేసుకున్నాను అతను నా మొహాన్ని రెండు చేతుల్లోకి తీసుకుని –

"ఎందుకు ఏడుస్తున్నావు?" అన్నాడు

నేను "ఏమీలేదు" అన్నాను

## జీవితవనంలో కొత్తగాలి

"ఏమీలేకుండానే ఏడుస్తున్నావా?"

"అవును"

"కారణం లేకుండానే ఎవరైనా ఏడుస్తారా?"

"ఏమీలేదు ఊరికే ఏడవాలనిపించింది ఏడిచాను"

"ఓహో! అందుకు ఇంతకంటే మంచిచోటు, ఇంతకంటే మంచి సందర్భం దొరకలేదా?"

నేను చివ్వున తలెత్తి చూశాను అతని మాటలు హేళనగా ఉన్నా, కళ్ళు మాత్రం "ఏమిటి సంధ్యా! కారణం నాకు చెప్పవూ" అన్నట్టున్నాయి అతను తలవంచుకుని తనే రెండు కప్పుల్లో కాఫీ కలిపాడు ఒకటి నా ముందుకు నెట్టి 'తీసుకో' అన్నాడు

నేనేదో అనబోతుంటే అతను అది గ్రహించిన వాడిలా "జస్ట్ ఫర్ కంపెనీ" అనటంతో నోరు మూసుకున్నాను

వేడివేడి కాఫీ గొంతులోకి దిగుతుంటే నా బుర్ర మెల్లిగా పని చేయసాగింది

అతను నన్ను "నువ్వు" అని ఏకవచనంతో పిలుస్తున్నాడు. అప్పుడే మొట్టమొదటిసారిగా కనిపెట్టింది నా మనసు నేను అతనితో ఇలా ఎందుకు హోటల్‌కి వచ్చాను? హఠాత్తుగా మూడు రోజుల క్రితం అతను నాకు ఫోన్ చేసిన విషయం గుర్తు వచ్చింది నాకు ఫోన్ చేసి అబద్ధం చెప్పిన

## ఫిల్ము లేని కెమెరా!

జపానులోని సోని కార్పోరేషనువారు ప్రప్రథమంగా ఫిల్ములేని కెమెరాను తయారు చేశారు ఈ కెమెరాను 'మావికా' అని అంటారు ఇందులో ఫిల్ముకు బదులు ఒక మాగ్నటిక్ డిస్కను అమర్చుతారు ఎలక్ట్రో మాగ్నెటిక్ సిస్టమ్ ననుసరించి పనిచేసే యీ కెమెరా సాధారణమైన 35 ఎం ఎం కెమెరా సైజును మించి ఉండదు ఇందులో ప్రతిబింబం ఎలక్ట్రానిక్ సిగ్నల్స్‌గా మారి, మాగ్నటిక్ డిస్కుమీద ముద్రించబడుతుంది మామూలు కెమికల్ ఫొటోగ్రఫీలోలా డెవలపింగ్, ప్రింటింగ్ చేయనవసరంలేదు ఒక ప్రత్యేక పరికరం ద్వారా యీ చిత్రాలను టెలివిజన్‌లో చూడవచ్చు కాపీలను తయారు చేసే క్రొత్త కలర్ ప్రింటర్‌ని కూడా వారు తయారు చేస్తున్నారు

ఆ పెద్దమనిషిని సీరియస్‌గా చూస్తూ కాఫీ తాగసాగాను

"ఏమిటి మెలుకువ వచ్చిందా?" అతను నవ్వుతూ అడిగాడు

నేను కప్పు క్రింద పెట్టేసి "ఇప్పుడే" అన్నాను

"మీరు నాకు ఎందుకు ఫోన్ చేశారు" సీరియస్‌గా అడిగాను

## కాఫీ రుచిని అధికంచేసే క్రొత్త తయారీ విధానము
## కాఫీ తాజాతనాన్ని అధికంగా సంరక్షించే క్రొత్త ప్యాకెట్

# క్రొత్త బ్రూక్ బాండ్ గ్రీన్ లేబిల్




ఇప్పుడు బ్రూక్‌బాండ్ వారు ఉపయోగిస్తూన్న క్రొత్తతయారీ విధానంవల్ల క్రొత్త గ్రీన్‌లేబిల్ కాఫీ రుచి ఇదివరకు కంటే చాలా అమోఘంగా వుంటుంది అంతేకాదు బ్రూక్‌బాండ్ వారిచే ప్రథమంగా ప్రవేశపెట్టబడిన క్రొత్త కీప్-ఫ్రెష్ ప్యాకెట్ కాఫీపొడి అప్పుడే చేయించిన కాఫీపొడిలాగ చెమ్మ ఎక్కకుండా వారాలకొద్దీ ఎప్పటికప్పుడే తాజాగా వుంటుంది

# క్రొత్త గ్రీన్ లేబిల్

**అమోఘమైన రుచి విశిష్టమైన తాజాతనము**
**(ఇది బ్రూక్‌బాండ్ వారు మాత్రమే చేయగలరు)**

ఎన్నిక చేసిన కొన్ని పట్టణములలో మాత్రం లభించును.

OBM 7148 TG

## జీవితవనంలో కొత్తగాలి

"కారణం చెప్పానుగా !"

"మీరు అబద్ధం ఆడాల్సిన ఖర్మ ఏం వచ్చింది ?"

అతను దెబ్బతిన్నట్టు చూసి "సంధ్యా" అన్నాడు

"చెప్పండి మీరు నాకు అలా ఎందుకు ఫోన్ చేశారు ?"

"ఎలా ఫోన్ చేశాను ?" అమాయకంగా అడిగాడు

"చిన్న ప్రమీల కలిసింది !" నేను అతని మొహంవంకే పరీక్షగా చూస్తూ అన్నాను అతను గతుక్కుమన్నట్టు వెనక్కి తగ్గాడు

"ఏం చెప్పింది ?" ఎలాంటి తొణుకూ బెణుకూలేని స్వరంతో అన్నాడు

"మా అన్నయ్యకి ఈమధ్య నామీద ప్రేమెక్కువయిందే సంధ్యా ! రెండు రోజుల నుండి రోజూ సాయంత్రం వస్తున్నాడు" అంది

అతని మొహం ఎర్రబడింది

"నీ మాటలకు చాలా పదునుంది సంధ్యా !" అన్నాడు

నేను తెల్లబోయాను "అచ్ఛా !" ఆశ్చర్యంగా అన్నట్టుగా అన్నాను

"నీది మరీ ఇంత మట్టిబుర్ర అనుకోలేదు" అతను కప్పు అటూ ఇటూ తిప్పుతూ అన్నాడు

"అచ్ఛా !" నాకు తెలియకుండానే వచ్చేశాను

అతను ఛర్రుమన్నట్టు చూసి "నువ్వు ప్రతిదానికీ ఇలా అచ్ఛా అనటం ఏం బాగాలేదు" అన్నాడు

"అదా ! అది నాకు బాగా అలవాటయి పోయింది" సంజాయిషీగా అన్నాను

"అచ్ఛా!" అతనీసారి అచ్చు నాలా పలకటంతో నేను తెల్లబోయాను

అతను బిల్లు అక్కడపెట్టేసి లేచాడు

నేను కదలకుండా "మీరు నాతో ఏదో మాట్లాడాలన్నారు" అన్నాను

'నేను మీతో మాట్లాడాలని చెప్పలేదే !"

"చెప్పకపోతే అలా ఎందుకు ఫోన్ చేసినట్టు ?"

"బావుంది మీ ప్రశ్న మా ప్రమీల మిమ్మల్ని రమ్మంది అని చెప్పానుగానీ, నేను మీతో మాట్లాడాలి అని అనలేదే!" అతను సీరియస్‌గా మొహం పెట్టినా, కళ్ళల్లో కొంటెతనం మిలమిల్లాడుతోంది

"ఛీ ! ఛీ !" నేను విసురుగా చేతులో రుమాలుతో మొహం తుడుచుకుంటూ బయటికి వచ్చేశాను నేను విసురుగా వచ్చెయ్యబోతుంటే అతను స్కూటర్ స్టార్టుచేసి –

"ప్లీజ్ సంధ్యా ! రా !" అన్నాడు

"థ్యాంక్స్ ! నేను వెళ్ళిపోగలను "

"అలాగా ! పోనీలే పాపం రోజూ అలా బస్‌ల వెంట పరిగెత్తి ఎక్కుతూనే ఉన్నావుగా ఈరోజు నా స్కూటర్‌మీద డ్రాప్ చేస్తాను రా "

"నో థ్యాంక్స్ !" అన్నాను మొహం తిప్పేసుకుంటూ

ఇంక ఆగక్కర్లేదు

Binaca Top toothpaste

# మీరు కోరుకునే బినాకా టాప్ తిరిగి వచ్చేసింది

గుర్తుంచుకోండి, బినాకా టాప్ లోగల ప్రత్యేకమైన, పంచే పదార్థం తక్షణం నోటిలోని మూల మూలకూ పాకి, పిప్పి పళ్ళుగా చేసే సూక్ష్మ క్రిములను తుదముట్టించి, నోటిలోని చెడు శ్వాసను నిరోధిస్తూ మీకు అనుభవంలోకి వచ్చే తాజాదనాన్ని యిస్తుంది — ఎప్పుడూ




## బినాకా టాప్ టూత్‌పేస్ట్ మీకు సంపూర్ణ నోటి రక్షణనిస్తుంది

ARMS-CBT-3-143-TL






బులుసు వేంకటరమణయ్య

# శ్రీకృష్ణుని ఉపదేశం

మానవుడు సుఖంగా ఉన్నప్పుడు కాలం ఇట్టే గడిచిపోయినట్లు తోస్తుంది కాని కష్టంలో ఉన్నప్పుడు దినం ఒక యుగంగా కనబడుతుంది ''ఈ కష్టం ఎప్పుడు గడుస్తుందా ?'' అనే ఆలోచనయే కలుగుతూ ఉంటుంది కాని, దానిని గురించి ఎక్కువ పట్టించుకోక ''యీ కష్టం కూడా గడిచి పోతుందిలే'' అనే ధీమాతోనే ఉండాలి కాని అధైర్య పడకూడదు అధైర్యమే మనిషిని క్రుంగదీస్తుంది

ఒకప్పుడు శ్రీకృష్ణుడు, ధర్మరాజు ఇష్టాగోష్ఠిగా మాటలాడుతున్నప్పుడు అనేక విషయాలు చర్చకు వచ్చాయి వాటిలో ధర్మం, కర్మం, అదృష్టం, దురదృష్టం, కష్టం, సుఖం అనేవికూడా ఉన్నవి ధర్మరాజు ప్రసంగ వశాత్తూ, తమ దురదృష్టాన్ని గురించీ, కష్టాలను గురించీ వివరిస్తూ, మనస్సులో చాలా కలతపాటుపొంది తన మనశ్శాంతికి ఏదైనా చక్కని సలహా ఇవ్వవలసిందనీ, ఆ ఉపదేశాన్ని తాను పాటిస్తాననీ తెలియజేశాడు

శ్రీకృష్ణుడు ఒక్క క్షణం ఊరకుండి, ఆ తర్వాత ''బావా ! నీకు నేను యిప్పుడేమీ సలహా యివ్వను దానివల్ల ప్రయోజనం వుండదు నా ఉపదేశాన్ని ఒక కాగితంమీద వ్రాసియిస్తాను దాన్ని యిప్పుడు నీవు చూడవద్దు నీ మనస్సుకు ఎంతో కష్టమని తోచినప్పుడు దాన్ని విప్పి చూడు'' అంటూ ఒక కాగితంమీద ఏదో వ్రాసి, దానిని మడిచి ధర్మరాజు చేతి కిచ్చాడు శ్రీకృష్ణుడు చెప్పినట్లే అప్పుడు దానిని చూడక భద్రంగా దాచుకున్నాడు

ఒకప్పుడు యుధిష్ఠిరునికి చాలా కష్టంగా ఉన్న సమయంలో శ్రీకృష్ణుడు చెప్పినట్లు ఆ కాగితం మడత విప్పి చదువుకున్నాడు అందులో ''ఇది కూడా కడచిపోతుంది'' అని మాత్రం ఉన్నది అదే శ్రీ భగవానుని మహోపదేశం దానిలో ఎంతో అర్థం ఇమిడి ఉన్నది

''దీనిని గురించి యింత కలతపడడ మెందుకు ? ఇది స్థిరంగా నిలిచి ఉండేదికాదు జరిగిపోతుంది దీంతర్వాత మేలు కలుగవచ్చు సుఖదుఃఖాలు, అదృష్ట దురదృష్టాలు కాలాన్ని బట్టి చక్రం వలెనే తిరుగుతూనే వుంటాయి కలతపడవద్దు'' అని దీనివల్ల తెలుస్తున్నది

ధర్మరాజు ఈ విషయాన్ని గ్రహించి తన కలతపాటును పోగొట్టుకొన్నాడు ఏ ఉపదేశ మయినా ఆయా సమయాల్లో అయితేనే బాగా పనిచేస్తుందనే అభిప్రాయంతోనే శ్రీకృష్ణుడు కాగితంమీద వ్రాసియిచ్చి, ఆ సమయంలో చూచుకొమ్మన్నాడని అతడు గ్రహించాడు

[భగవాన్ శ్రీ సత్యసాయిబాబా ''చిన్న కథ'' ఆధారంగా చేసిన విపులీకరణ ] ●

''రేయ్ కిరణ్ ! కిరణ్'' హఠాత్తుగా వినిపించటంతో ఉలిక్కిపడ్డాము ఒక ఎర్రటి కుర్రాడు దాదాపు కిరణ్ ఎత్తు ఉన్నాడు

''ఎన్నాళ్ళయిందిరా ! కనిపించి'' అంటూనే కావిలించుకున్నంత పనిచేశాడు కిరణ్ కూడా అతన్ని చూస్తూనే ''ఒరేయ్ నువ్వట్రా'' అన్నాడు నేను చకచకా నడుచుకుంటూ బస్‌స్టాప్ కొచ్చేశాను

చీకటి పడిపోయింది లైట్లు పట్టపగల్లా వెలుగు చూపిస్తున్నాయి నాకంటి ముందునుండి రివ్వున స్కూటర్ దూసుకుపోయినప్పుడల్లా సాయంత్రం నేను చూసిన సంఘటన గుర్తొచ్చి ముల్లులా ఒక ప్రక్క మనసులో గుచ్చుకుంటూనే ఉంది ఆ సమయంలో నిజంగా నాకు మతిపోయినట్లే అనిపించింది అంతకు ముందు ప్రమీల నాకీ విషయం చెప్పబట్టి సరిపోయింది లేకపోతే ఈరోజు దాన్నలా స్కూటర్‌మీద ఎవరితోనో చూసుంటే అక్కడే స్పృహతప్పి ఉండేదాన్ని నాకు మళ్ళీ తగని నీరసం ముంచుకువచ్చింది చచ్చేంత ఆకలి వేస్తోంది ఈరోజు అన్నం కూడా సరిగ్గా సయించలేదు వెధవ బస్సు ఒక్కటీ ఆగదు

## జీవితవనంలో కొత్తగాలి

ఒకవేళ ఆగినా ఇద్దరు ముగ్గురు ఎక్కంగానే వెంటనే వెళ్ళిపోతోంది ఏదైనా రిక్షా పిలిచి వెళ్ళిపోదామని పించింది

బర్రున శబ్దం అయ్యేసరికి ఎగిరిపడ్డట్లు వెనక్కి అడుగు వేశాను కిరణ్ ప్రత్యక్షమైనాడు మళ్ళీ

''సారీ ! సంధ్యా చాలా లేటయింది రా నేను దింపేస్తాను'' అన్నాడు కిరణ్

నాకు నిజంగా ఆ సమయంలో అసలు ఓపిక లేకుండాపోయింది పిలిచీ పిలవంగానే వెళ్ళి స్కూటర్ మీద కూర్చున్నాను

''వెరీ గుడ్ ! అలా చెప్పిన మాట వినాలి ''

చచ్చేంత నీరసంగా ఉండటంతో అప్పటికి ఊరుకున్నాను లేకపోతే ఫెడీమని ఏదో ఒక సమాధానం చెప్పేదాన్నే ! అతను హఠాత్తుగా ఒక గుంటలోనుండి పోనివ్వటంతో నేను తూలి అతని భుజమ్మీద పడ్డాను ''సారీ'' అన్నాను అంతే కానీ తల మాత్రం తియ్యలేదు అలా భుజంమీద తల వాల్చుకుని కళ్ళు మూసుకున్నాను అతను ఉన్నట్టుండి నా తలమీద చెయ్యివేస్తూ -

''సంధ్యా ! నిజంగా నేను నీతో మాట్లాడ దామనే నీదగ్గరకొచ్చాను ఎందుకో తెలీదుగానీ ఈ రోజు నీ మూడ్ బాగున్నట్టులేదు ఎందుకో విపరీతంగా బాధపడుతున్నావు ఇంకో రోజు తప్పకుండా చెబుతాను'' అన్నాడు

నేను సమాధానం చెప్పలేదు స్కూటర్ దిగి ''అచ్ఛా ! గుడ్‌నైట్'' అన్నాను

''గుడ్‌నైట్'' అని అతను వెళ్ళిపోయాడు

గేటు తీసుకుని లోపలికి వస్తుంటే హఠాత్తుగా ఒక అనుమానం వచ్చింది — శశి ఎవరో మొగాడితో స్కూటర్‌మీద వచ్చినందుకు అంత బాధపడ్డాను మరి నేను చేసిన పనేమిటి ? మై గాడ్ ! నాకూ, శశికి తేడా ఏమిటి ? ఇంకా నేనే పెద్దదాన్ని! ''అది చేసిన తప్పు నేనేం చేయటం లేదు అది అతన్ని ప్రేమించింది నేనలా కాదే ! నాకు చాలా బాధ్యతలున్నాయి నేను ఇలా రావటం తప్పేమీకాదు—'' అని నాకు నేనే సర్దిచెప్పుకుంటూ గుమ్మంలోకి వచ్చాను

(ఇంకా వుంది)

# ఇప్పుడు!
# నెలలో 6 డ్రాలు

## 10 DAY DRAW

10TH 20TH 30TH

గొప్ప బహుమతి
**రూ.1,50,000**

రూ 4,56,000 విలువగల
40,960 నగదు బహుమతులు

ప్రతి టిక్కెట్టు రూ.1

## MINI DRAW

5TH 15TH 25TH

గొప్ప బహుమతి
**రూ.20,000**

రూ 1,90,000 విలువగల
22, 292 నగదు బహుమతులు

ప్రతి టిక్కెట్టు 50 పై

*త్వరిత డ్రా!*
*త్వరిత బహుమతి!*

మైసూర్ సేల్స్ ఇంటర్నేషనల్ లిమిటెడ్

# కర్నాటక రాష్ట్ర లాటరీ

KSL-52-TEL

వాక్చిత్రాల స్వర్ణోత్సవం

# తెలుగు చలనచిత్ర చరిత్రలో ధృవ తారలు!

ఐదవ జార్జి చక్రవర్తి 1909లో మద్రాసుకు విచ్చేసిన సందర్భంలో తెరమీద చలన చిత్రంతోపాటు శబ్దం కూడా వినిపించడానికి ప్రయత్నం జరిగింది గ్రామఫోన్ రికార్డులను చలన చిత్రంతో కలిపి ఏక కాలంలో ప్రారంభించటం ద్వారా దీనిని సాధించ గలిగారు. దీని పేరు 'క్రోనో మెగాఫోన్' (గమంట్ అండ్ కో వారి తయారీ)

## రఘుపతి వెంకయ్య

భారతీయ చలన చిత్రకళకు దాదా సాహెబ్ ఫాల్కే ఆద్యుడైతే, తెలుగు చలన చిత్రకళకు రఘుపతి వెంకయ్యనాయుడు పితామహుడు ఈయన 'క్రోనో మెగాఫోన్' యంత్రాన్ని 30 వేల రూపాయలకు కొని, మూడు నాలుగు వందల అడుగుల నిడివిగల చలన చిత్రాలు ఒక డజన్ తెప్పించి, మద్రాసులో అప్పటి టౌన్ హాలైన 'విక్టోరియా పబ్లిక్ హాలు'లో తొలిసారిగా ప్రదర్శించి, ప్రేక్షకులను చకితుల్ని చేశారు ఆ యంత్రంతో దక్షిణ భారతదేశమంతా పర్యటించారు బర్మా, రంగూన్, సిలోన్‌లలో కూడా ప్రదర్శనలిచ్చి, ప్రశంసలందుకున్నారు ఆ ఉత్సాహంతో 1910లో ఒక టూరింగ్ టెంట్ ఏర్పాటుచేసి, బొంబాయి, బెంగుళూరు నగరాలలో, తెలుగు జిల్లాలలో ప్రదర్శన లిచ్చారు 1912లో మద్రాసులో పర్మినెంట్ థియేటర్ 'గెయిటీ' నిర్మించారు మద్రాసు 'క్రౌన్, గ్లోబ్' థియేటర్లను కూడా నిర్మించింది ఈయనే ఈయన స్మారకార్థం మన రాష్ట్ర ప్రభుత్వం 'రఘుపతి వెంకయ్య' అవార్డును ఏర్పాటు చేసిన విషయం సర్వవిదితమే

## పోతిన శ్రీనివాసరావు

మన రాష్ట్రంలో తొలి సినిమా థియేటర్ నిర్మించినవారు పోతిన శ్రీనివాసరావు నాటకాలు ప్రదర్శించే నాటి బెజవాడలోని మారుతీ హాలును 1921 అక్టోబర్ 3న తొలుత మూకీ చిత్రాలతో 'మారుతీ సినిమా'గా ప్రారంభించారు అంతకు ముందు వీరికి టూరింగ్ సినిమాలు కూడా ఉండేవి వీరు 1958లో విజయవాడలో అత్యాధునికంగా 'శ్రీనివాస మహల్'ను నిర్మించారు ఈ రెండు థియేటర్లలో ఎన్నో చిత్రాలు శతదినోత్సవాలు జరుపుకున్నాయి ప్రథమ శతదినోత్సవ చిత్రం 'మంగమ్మ శపథం'' రజతోత్సవం జరుపుకున్న మొదటి చిత్రం ''చంద్రలేఖ'' ఈ రెండూ జెమినీవారి తమిళ చిత్రాలే తొలి టాకీ 'ఆలం ఆరా' బొంబాయిలో విడుదలైన రోజునే మారుతీ టాకీస్‌లో కూడా విడుదలైంది ఈనాటివరకూ యాజమాన్యం మారకుండా ఉన్న థియేటర్ మన దేశంలో ఇదొక్కటేనేమో !

వర్తక గోదాములు 1928–29 మధ్య అనేక నగరాల్లో సినిమా హాల్సుగా మారిపోయాయి ఇలా రెండేళ్ళు తిరక్కముందే దాదాపు 70 థియేటర్లు ఏర్పడ్డాయి వెస్ట్రెక్ సౌండ్ సిస్టం ఇంజనీర్లు యంత్ర సామగ్రిని దిగుమతి చేయించడంతో మూకీ చిత్రాలస్థానే వాక్చిత్రాలు వచ్చాయి సినిమాల పట్ల ఆసక్తి ప్రజలలో మరింత పెరిగింది

## జి. కె మంగరాజు

తొలి తెలుగు టాకీ చిత్రాన్ని, మనరాష్ట్రంలో పంపిణీ వ్యవస్థను నెలకొల్పినవారు జి కె మంగరాజు 1927లో ఈయన విశాఖపట్నంలో సినిమా థియేటర్‌ను స్థాపించారు 1932 ముందుగానే అక్కడ ఓ చిత్ర పంపిణీ సంస్థను నడుపుతూ వచ్చారు అయితే, చలన చిత్రరంగానికి వాణిజ్య కేంద్రంగా విజయవాడ అభివృద్ధి చెందుతూన్న దృష్ట్యా, 1937లో తన వ్యాపారాన్ని విజయవాడకు తరలించారు ఆ 'క్వాలిటీ పిక్చర్స్' సంస్థ తర్వాత పూర్ణాపిక్చర్స్‌గా మారింది ఈయన ప్రోత్సాహంతో, పర్యవేక్షణలో హెచ్ ఎం రెడ్డి 1931లో ''భక్త ప్రహ్లాద'' తెలుగు టాకీని సమర్పించారు అందులో విఖ్యాత దర్శక నిర్మాత, స్టూడియో అధినేత ఎల్ వి ప్రసాద్ నటించారు హెచ్ ఆర్ పద్మనాభశాస్త్రి తొలి సినిమా సంగీత దర్శకుడు మొదటి తమిళ వాక్చిత్రం ''కాళిదాసు''ను తయారు చేసిన ఘనత కూడా రెడ్డిగారికే దక్కుతుంది

## సి పుల్లయ్య

తెలుగు టాకీల తొలిదశలో ''లవకుశ, సతీ సావిత్రి'' చిత్రాలతో మనరాష్ట్రంలో గొప్ప సంచలనం కలిగించిన మరో ప్రతిభాశాలి దర్శక నిర్మాత సి పుల్లయ్యగారు 1932లో విడుదలైన ''సతీ సావిత్రి'' ఒక్క బెంగళూరులోనే ఆ రోజుల్లో 17 వారాలకు పైగ ఆడింది ఈయన కాకినాడ లోని తమ స్వంత భవంతి వద్దే సెట్టువేసి, కొన్ని సాంకేతిక పరికరాలతో ''మార్కండేయ'' చిత్రాన్ని నిర్మించి, ఇంటి వద్దే డెవలపింగ్, ప్రింటింగ్ కూడా నిర్వహించారు అక్కడ ఆయన కట్టించిన 'సిటీ ఎలెక్ట్రిక్ సినిమా థియేటర్'లోనే రషెస్ చూసుకునేవారు ఆ థియేటరే తర్వాత క్రౌన్ టాకీస్‌గా మారింది 1949లో దక్షిణ భారతంలో మొట్టమొదటి ఏర్ కండిషన్డ్ థియేటర్ – మద్రాసులో మినర్వా టాకీస్‌ను నిర్మించింది ఈయనే అందరూ బాలలే నటించిన తొలి తెలుగు చిత్రం ''ధ్రువ – అనసూయ'' రూపొందించిందీ ఈయనే తొలి తెలుగు సంపూర్ణ వర్ణచిత్రం లలితా శివజ్యోతివారి ''లవకుశ''కు దర్శకత్వం వహించే ఘనత కూడా ఈయనకే దక్కింది !

'బాలనాగమ్మ' లో శ్రీదేవి



## నిడమర్తి సూరయ్య

బందరులో పి వి దాసు, బళ్ళారిలో గోపాలరావు, రాజమండ్రిలో నిడమర్తి సూరయ్య ప్రభృతులు పర్మినెంట్ థియేటర్లు కట్టించారు 1924లో రాజమండ్రిలో తొలి సినిమాహాలు 'కృష్ణా సినిమా' నిర్మించిన నిడమర్తి సూరయ్యగారు అక్కడే 1936లో 'శ్రీ దుర్గా సినీటోన్' అనే స్టూడియోను లేబరేటరీతో సహా నెలకొల్పి ''సంపూర్ణ రామాయణం' చిత్రాన్ని తీశారు అందులో నేటి హిందీతార రేఖ తల్లి పుష్పవల్లి సీతగా నటించింది

1937లో హెచ్ ఎం రెడ్డి నిర్మించిన ''గృహలక్ష్మి'' చిత్రానికి పుష్కలంగా డబ్బు రావడంతో సాంఘిక చిత్రాల నిర్మాణం పట్ల కొందరికి ఉత్సాహం కలిగింది ఆ ఉత్సాహంతో స్థాపించబడినవే బి ఎన్ రెడ్డిగారిచే వాహినీ సంస్థ, గూడవల్లి రామబ్రహ్మంగారిచే సారథీ సంస్థ ఈ సంస్థల నుంచి శిల్ప రీత్యా, వ్యాపార రీత్యానే కాకుండా సాంఘిక ప్రయోజనాన్ని సాధించే పలు చిత్రాలు వెలువడ్డాయి

ఆ రోజుల్లో చలన చిత్ర నిర్మాణంలోని అన్ని శాఖల్లోనూ నిష్ణాతులైనవారే దర్శకత్వం వహించే వారు వై వి రావ్, పి పుల్లయ్యగార్ల లాంటి వారికి తెలియని శాఖే లేదేమో ! పాజిటివ్ ఫిలిమ్‌ను ఎడిట్ చేయకుండా సరాసరి నెగిటివ్ ఫిలిమ్‌నే ఎడిట్ చేయగల దిట్ట వై వి రావుకు తొలి కన్నడ వాక్చిత్రం ''సతీ సులోచన'' రూపొందించిన గౌరవం కూడా దక్కింది అందులో ఆయన లక్ష్మణుని పాత్రను అద్వితీయంగా పోషించారు కూడా

ఇలా ఆదిలో ఎందరో తెలుగు చలన చిత్రకళకు నాందీప్రస్తావన చేసి, బహుముఖ సేవలు చేశారు

— జి. వి. జి


నయనాభిరామం
మనసును దోచే మృదువైన
నేతలలో ప్రియ టెరీన్* చీరలు.
చిత్ర - విచిత్ర లతా పుష్పముల
విన్యాసముతో కూడినవి. కనులకు
ఇంపైన రంగులలో. ప్రతి
ఒక్కరి అభిరుచికి
అనుగుణంగా.
షో రూమ్: కావేరి భవన్, బెంగళూరు-560 009.
దాజిబాన్ పేట్, హుబ్లి 580 020.
చిత్ర దుర్గా రోడ్, దావణగేరే 577 002.
ఫ్యాషన్ వస్త్రములు
ది దావణగేరే కాటన్ మిల్స్ లిమిటెడ్,
హనుమంతప్ప బిల్డింగ్స్,
చిత్రదుర్గ రోడ్, దావణగేరే-577 002
TA/DCM/C/11/TEL



# నా ప్రపంచం వికసించింది ...దాన్ని పెంచి పోషిస్తోంది జై కిసాన్

జైకిసాన్ మీ పంటలను పెంచి పోషిస్తుంది, మీ కలల్ని నిజమని నిరూపిస్తుంది. అధునాతనమైన సాంకేతిక పరిజ్ఞానం ఆధారంగా గల జైకిసాన్ శక్తివంతమైన ఎరువులు భూమిలో వెంటనే కరిగి మీ పంటలకు అపారమైన శక్తినీ, తక్షణమైన పెరుగుదలనూ చేకూరుస్తాయి. మీ పైరతోపాటే మీ భాగ్యంకూడా వికసిస్తుంది .. మీకు హెచ్చు దిగుబడినీ, దాంతోపాటు హెచ్చు సంపదనూ ఇస్తుంది జైకిసాన్. గుర్తుంచుకోండి, ప్రతి పంటకు, ప్రతి భూమికి అవసరానికి తగిన పాళ్లలో వేయడానికి జైకిసాన్ ఎరువు ఉంది. జైకిసాన్ ఎరువుల విస్తృతమైన శ్రేణిలోంచి మీరు మీకు కావలసినదాన్ని ఎంచుకోవచ్చు.

**జై కిసాన్ యూరియా 46.4% నత్రజని** అతి తెల్లటిది, అతి స్వచ్ఛమైనది, అతి శక్తివంతమైనది. దీనిలో బైయూరేట్ పాలు అతి తక్కువ (0.5% కంటే తక్కువ). అంచేత ఆకుల మీద పిచికారి చేయడానికి సురక్షితమైనది. అన్ని పంటలకూ భూమిమీద పై చల్లుగా అనువైన ఎరువు.

**జై కిసాన్ యూరంఫాస్ 28:28:0** అత్యధికంగా నత్రజనీ, ఫాస్ఫేటూ సమానమైన పాళ్లలో గల శక్తివంతమైన ఎరువు. దాదాపు పూర్తిగా నీటిలో కరుగుతుంది. దీనిలోని రెండు పోషక పదార్థాలూ కూడా ఒకే సమయంలో భూమిలో కరిగి పెరుగుతున్న పంటకు అందుబాటులో ఉంటాయి.

**జై కిసాన్ సంపూర్ణ 19:19:19** అతి చిక్కనైన కాంప్లెక్స్ ఎరువు. దీనిలో నత్రజని, ఫాస్ఫేటు, పొటాష్‌లు సమానమైన పాళ్లలో ఉన్నాయి. దాదాపు పూర్తిగా నీటిలో కరిగే ఈ ఎరువులో 57% పోషక పదార్థాలున్నాయి అవన్నీ ఒకే సమయంలో భూమిలో కరిగి పంట వాటిని సులభంగా గ్రహించడానికి వీలు పడుతుంది. పొటాష్ లోపం గల భూములకు జైకిసాన్ సంపూర్ణ ప్రత్యేకించి లాభదాయకమైనది.

**జైకిసాన్ యూరంఫాస్, సంపూర్ణ ముఖ్యంగా అధిక దిగుబడి రకపు వరి, చెరకు, కాయగూరలు, పత్తి, జొన్న, గోధుమ మొదలైన పంటలకు బాగా అనువైనవి. అంతేకాదు, కాఫీ, తేయాకు లాంటి తోట పంటలకూ, మామిడి, కమలా, నారింజ, అరటి మొదలైన పండ్ల తోటలకూ కూడా ఎంతో అనువైనవి.**

**జై కిసాన్ సౌభాగ్య 14:35:14** నత్రజని, పొటాష్‌లు దీనిలో సమానమైన (ఒక్కొక్కటి 14%) పాళ్లలో ఉన్నాయి. పైగా 35% ఫాస్ఫేటు కూడా ఉంది—అంటే మొత్తం 63% పోషక పదార్థాలు ఉన్నాయన్నమాట. ఫాస్ఫేటు హెచ్చుగా ఉండటం వల్ల జైకిసాన్ సౌభాగ్య ముఖ్యంగా వేరుశనగ, ఇతర నూనె గింజల పంటలకూ, పప్పు దినుసుల పంటలకూ బాగా అనువైనది. దుంపజాతి పంటలైన బంగాళాదుంప (అలుగడ్డ), పసుపు, కందమూలం, ఉల్లి మొదలైనవాటికి కూడా ఎంతో మంచిది. చెరకు, పత్తి పంటలకూ, ఏలకులు మొదలైన తోట పంటలకూ కూడా ఉపయోగకరమైనది.

**జై కిసాన్ డయంఫాస్ 18:46:0** డయంఫాస్ 18.46:0 లో 18% నత్రజని, 46% ఫాస్ఫేటు ఉన్నాయి. అత్యధికంగా పాళ్లు కలిగిన కాంప్లెక్స్ ఎరువు అయినందువల్ల తక్కువ పరిమాణంలో వేస్తే చాలు. అంచేత ఖర్చుకూడా చాలా తక్కువ. ఈ ఎరువు ప్రత్యేకించి, హెచ్చుగా ఫాస్ఫేట్ కావలసిన పంటలకు అంటే వేరుశనగ, పప్పు దినుసులు, నూనె గింజలు మొదలైన వాటికి, పసుపులాంటి దుంపజాతి పంటలకూ అనువైనది. చెరకు, పత్తి పంటలకు కూడా మంచిది.

## జై కిసాన్ ఎరువులు-అత్యంత శక్తికీ, సత్వర పెరుగుదలకూ




**జువారి అగ్రో కెమికల్స్ లిమిటెడ్, గోవా.**
ప్రాంతీయ విక్రయ కార్యాలయాలు: కర్నూలు, సికింద్రాబాద్, బెంగుళూరు, హుబ్లి, కొంకణ్, నాగపూర్, పూనా.
మీ జైకిసాన్ ఎరువుల్ని జువారి వారి పసుపు పచ్చ దుకాణాల్లో కొనుక్కోండి





# విమల్ వారి అసాధారణ ఉత్పాదన:
# 11 రకాల సింథెటిక్ సూటింగ్స్.

వింటర్ వార్మర్స్ • సన్ డౌనర్స్ • కెరిస్మా • సోఫిస్టిక్ • వెస్ట్ మెన్ • ఫేంటసీ • ఎక్స్‌క్లూజివ్ లెంత్స్
• సిల్క్‌మూండ్ • సార్డీనియా • మహారాజా మరియు టెరెక్స్
ఇవన్నీ సరిక్రొత్త సుల్జర్ మెషీన్లపైన తయారయిన అసాధారణ సూటింగ్స్








# సినిమా

—జి.వి.జి.

## బాలనాగమ్మలో తిప్పడికి తప్పని తిప్పలు !

తిప్పడు (అల్లు రామలింగయ్య) రొప్పుతూ రోజుతూ పరుగున వచ్చి, "మల్లీ! కొంప మునిగిందే! తప్పించుకోడానికి ఏదైనా దారి చెప్పవే," అన్నాడు.

మళ్ళీ కొంప మునిగేంత గొడవేదో అతను చేసుంటాడని మల్లి (మమత)కి తెలుసు. అందుకే "ఉన్నదొకటే దారి – గోదారి. ఎల్లి దూకు," అంది వెటకారంగా.

"ఈతకూడా రాదే నాకు. గుటుక్కున సస్తా!" ఏడ్పుముఖం పెట్టాడు తిప్పడు.

"ఏడిశావ్‌గాని, ఓ పని సెయ్యి. ఊపిరి బాగా బిగబట్టి, కదలకుండా పడుకో. మిగతాది నేను సూసుకుంటా," అంటూ మల్లి మంచం వేసి, తిప్పడ్ని శవంలా పడుకోమంది.

ఇంతలో ఊరివాళ్ళంతా విరుచుకుపడ్డారా కొంపలో. "ఏంవే? నంగనాచిలా నీ మొగుడు అట్టా పడుకున్నాడు?" అని అడిగాడొకడు.

మల్లి అరున్నొక్క రాగం ఆలాపించసాగింది: "అయ్యో, నంగనాచి కాదు గోవిందా – నన్ను నట్టేట ముంచాడు గోవిందా... బంగారంలాంటోడు గోవిందా – నన్ను బావురుమనిపించాడు గోవిందా... అరకోడొండమన్నాడు గోవిందా – అర్ధరాత్రొచ్చి తింటానన్నాడు గోవిందా...అన్నిటినీ వదలిపెట్టాడు గోవిందా – నన్నన్యాయం చేశాడు గోవిందా."

"నిన్న రాత్రి నన్ను సుట్టపీకడిగితే ఇచ్చాను. ఇయ్యాల సూస్తే సుట్టసుట్టుకుపోయాడు," అని లోకయ్య (మోదుకూరి సత్యం) సానుభూతి సూపిస్తూ, "మల్లీ, పోయినోడు పోయాడు. ఇంకాడికోసం ఏడ్చి ఏం లాభం? మీ కులాచారం పెకారం శవాన్ని ఏం చేయాలి? కాల్చాలా? పాతాలా?" అని అడిగాడు.

మల్లి గుండె ఝారెత్తిపోయింది. "నేనేం బదులు చెప్పనో గోవిందా!" అంటూ తిప్పడి తల దగ్గర మంచానికి తన తలను మోదుకుంటూ బావురుమంది. ఆమె చెవిలో తిప్పడు "కాల్చొద్దు, పాతొద్దు. నీట్లో తోసెయ్యమను," అన్నాడు. మల్లి మళ్ళీ రోదిస్తూ, "మేం నీళ్ళలో బతికేవాళ్ళం గోవిందా! నీళ్ళల్లో తోసెయ్యండి గోవిందా!" అంది.

"అదెట్టా వీలవుద్ది? ఊరికున్న దొకటే ఏరు. ఆ ఏట్లో తోసేస్తే, నీళ్ళు కంపుకొట్టిపోవూ? అదేం కుదరదు. ఆచారం పెకారం కాల్చాల్సిందే," అని లోకయ్య అనగానే "కాల్చాలి. అవును," అన్నారతనితో వచ్చిన వారందరూ.

దాంతో హడలిపోయిన తిప్పడు అమాంతంగా లేచి కూర్చున్నాడు. "చూస్తారేంట్రా?" అంటూ అందరూ కలిసి అతనిమీద పడ్డారు.

వాహిని స్టూడియో మూడో ఫ్లోర్‌లో ఇటీవల చిత్రీకరణ జరిగిన కె. బి. క్రియేషన్స్ "బాలనాగమ్మ" చిత్రంలో శరత్‌బాబు, శ్రీదేవి, కె. ఆర్. విజయ, మంజుభార్గవి, సుదర్శన్ ముఖ్య పాత్రధారులు. కె. శంకర్ దర్శకత్వంలో ఎ. ఖాదర్ నిర్మాత. డిసెంబర్ విడుదల.


'ప్రేమకు అంతం ఏది'లో శాంతి


'డబ్బు!డబ్బు! డబ్బు!'లో రాధిక, మురళీమోహన్

## చిత్రాల పేర్లు

కృష్ణ, శ్రీదేవి నాయకా నాయికలుగా ఎ. సి. త్రిలోక్‌చందర్ దర్శకత్వంలో గంగూరి వెంకటరత్నం నిర్మించే ప్రసన్నలక్ష్మి పిక్చర్స్ చిత్రం "వంశానికి ఒక్కడే".

సి. వి. రాజా కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో తలాటం వెంకటేశ్వరరావు నిర్మించే భీమేశ్వర ఆర్ట్స్ మూవీస్ చిత్రం "ప్రేమజ్వాల".

# భారీ మట్టి పనులకు-ఎస్కార్ట్స్




## తక్కువ పెట్టుబడితో, తక్కువ నిర్వహణా ఖర్చుతో భారత దేశ పరిస్థితులకు సరిపడే శక్తివంతమైన ప్రత్యేక బలగం






భారత దేశపు జాతీయ నిర్మాణ కార్యకలాపాలలో ఎస్కార్ట్సు శక్తి వంచన లేకుండా పాల్గొంటున్నది. పారిశ్రామిక, భవన నిర్మాణ సాధన సామగ్రిలో బహుముఖంగా ఉపయోగపడే విధంగా, అన్ని అవసరాలను తీర్చేట్టు ఎస్కార్ట్సును తీర్చిదిద్దారు. ఫ్రంట్ ఎండ్ లోడర్‌లు, 3 నుంచి 8 టన్నుల శక్తి స్తోమతగల క్రేన్‌లు, ఇండస్ట్రియల్ డిగ్గర్‌లు, హాలర్‌లు, డంపర్‌లు, గార్బేజ్ హాండ్లింగ్ అండ్ కంటెయినర్ సిస్టమ్‌లు మొదలయిన సర్వ తరహా యంత్ర సామగ్రి ప్రత్యేకంగా ఎస్కార్ట్సువారు రూపొందించారు

తక్కువ పెట్టుబడి పెట్టగల చిన్న చిన్న కొనుగోలుదార్లు భారీ మట్టి త్రవ్వకం పనులు చేపట్టేందుకు వీలుగా ఉభయ విధాల ప్రయోజనకరంగా ఉండే ట్రాక్టరును కూడా ఎస్కార్ట్సు ప్రవేశపెట్టింది. ఎస్కార్ట్ జెసిబి 3సి ఎక్స్‌కవేటర్-లోడర్ చిన్న కొనుగోలుదార్లకు సరిపడే ధరలో ఎన్నెన్నో విధాల ప్రయోజనకరంగా ఉంటుంది. భారత దేశంలో ఎస్కార్ట్సువారు ఉత్పత్తి చేస్తున్న ఈ ట్రాక్టర్, 52 దేశాలలో ఈ తరగతికి చెందిన వాటిలో అత్యధికంగా అమ్ముడుపోతున్నది. ఇవేళ జాతీయ నిర్మాణ కృషిలో ఇటువంటి ట్రాక్టర్లు 4000 కు పైగా పని చేస్తున్నాయి. ఎస్కార్ట్సు వికేంద్రీకరించిన తమ అనేక స్వంత ఉత్పత్తుల క్రమంలో పెద్ద పెద్ద ప్రాజెక్టులకు మట్టి త్రవ్వకం, నిర్మాణం పనులకు ఎస్కార్ట్సు ఫియట్ ఎల్లిస్ నార్త్-వెస్ట్, జె సి బామ్‌ఫర్డ్ సంస్థలకు ప్రతినిధిగా వ్యవహరిస్తోంది



భారత దేశపు మొట్టమొదటి హైడ్రాలిక్ మొబైల్ 8-టన్నుల క్రేన్. హైడ్రాలికల్లీ యాక్చుయేటెడ్ టెలిస్కోపిక్ బూమ్‌తో త్వరిత గతిని హాయిస్టింగ్ వించింగ్ ద్వారా సౌకర్యాలు ఈ ట్రాక్టర్‌లో ఏర్పరచారు

**భారత దేశపు కీలకావసరాలకు సరిపడే ఆధునాతన సాంకేతిక పరిజ్ఞానాన్ని అనుసరిస్తోంది.**

**ఎస్కార్ట్స్ లిమిటెడ్**

11 ఇండియా హౌస్, కన్నాట్ సర్కస్, న్యూ ఢిల్లీ-110 001

HTD-ESC-6963 F

ఇండస్ట్రియల్ అండ్ కన్‌స్ట్రక్షన్ ఎక్విప్‌మెంట్ * రైల్వే ఏన్సిలరీస్ * ఆటోమోటివ్ ఏన్సిలరీస్ * ట్రాక్టర్లు-వ్యవసాయ యంత్ర సామగ్రి * మోటార్ సైకిళ్ళు * హీటింగ్ ఎలిమెంట్స్

# సినిమా

## బంగారు భూమిలో చందారావ్

హోటల్ సూరమ్మ (సూర్యకాంతం) నూతి లోంచి ఆదేపనిగా నీళ్ళు తోడుతూ గంగాళాలు, బిందెలు, కాగులలోకి వరుసగా నింపుతోంది. అక్కడ చాలాసేపుగా బిందెలతో నిలుచొని ఉన్న అమ్మలక్కలకు విసుగెత్తిపోయింది. "ఏమిటే, సూరమ్మా! నీ గంగాళాలు నిండేవరకు మేం గంగిగోవుల్లా నిలబడాల్సిందేనా?" అని ఒకామె అడిగింది.

"మీలాగా అయిదారుగురుండే కొంపనుకుంటున్నారా? తెల్లారితేస్తే మీ కొంపలో ఉన్నోళ్ళందరూ నా హోటల్‌మీద పడి, 'సూరమ్మా, పళ్ళపొడి! సూరమ్మా, వేపుళ్లు!' అని నోరు కడుక్కునే దగ్గర్నుంచి చెంబట్టుకుపోయేవరకు నా నీళ్ళే వాడుతారు," అని నిర్లక్ష్యంగా సమాధానమిచ్చింది సూరమ్మ.

మరొకావిడకు చిర్రెత్తుకొచ్చింది. "అందుకని మా ఇళ్ళల్లో ఉన్న పిల్లాజెల్లా మంచినీళ్ళకు కూడా నోచుకోమన్న మాట?" అంది కయ్యానికి కాలు దువ్వుతున్నట్లు.

ఇంతలో ఆ దారంట వస్తూన్న చందారావు (రావు గోపాలరావు) "నోచుకోరు. అది మీ ఖర్మ. ఇన్నేళ్ళుగా నా నెత్తి నోరూ బాదుకుంటూన్నా... నన్ను పంచాయితీ ప్రెసిడెంటుగా ఎన్నుకోండి — ఆకాశగంగను నేలకు దించిన భగీరథుడిలా, పాతాళ గంగను పైకి తెచ్చిన అర్జునుడిలా — నీళ్ళు తెప్పించి ఇంటింటికీ ఒక కుళాయి వేసి, మన సిరిపురాన్ని గంగాపురంగా మార్చుండేవాణ్ణి," అన్నాడు.

పక్కనే బిందెతో నిలబడి ఉన్న కాసులయ్య (అల్లురామలింగయ్య) "అంటే — ఊరంతటినీ గంగలో ముంచేవాడివన్న మాట? నీ పథకాలన్నీ నాకు తెలును లేవయ్యా! ఇది నీ ప్లాట్‌ఫామ్ అనుకున్నావా — ఉపన్యాసాలు దంచడానికి? పబ్లిక్ నీళ్ళ బావి. అందులోనూ నీళ్ళు తెచ్చే బాధ్యత మొగాళ్ళది కనుక — ఆడవాళ్ళు తప్పుకుని నన్ను తోడుకోనివ్వండి," అంటూ ముందుకు నడిచాడు. అతనికి అడ్డు తగులుతూ అమ్మలక్కలు ఒకరినొకరు తోసుకుని నూతి దగ్గరికి పోబోయారు. దాంతో ఘర్షణ ప్రారంభమైంది. చందారావు నవ్వుతూ చూస్తూండిపోయాడు.


'ఏమండోయ్ శ్రీమతిగారు'లో రాధిక

కృష్ణ హీరోగా ఎస్. పి. వెంకన్నబాబు నిర్మించే మహేశ్వరీ మూవీస్ "బంగారు భూమి" చిత్రానికి పి. చంద్రశేఖరరెడ్డి దర్శకుడు.

## పోలీ కేక

మాదాల రంగారావు సారథ్యంలో గిరిబాబు సమర్పించే పై చిత్రంలో వీరిద్దరితోపాటు కథానాయకుడుగా మురళీమోహన్ నటిస్తారు. క్రాంతి రాసిన కథకు ఎం. జి. రామారావు సంభాషణలకర్త.

'మాయదారి అల్లుడు'లో కృష్ణ, జయప్రద



# జుట్టు అసలు ఎందుకు ఊడుతుందని ?

జుట్టుపైన ప్రకృతిలోని చాలావాటి ప్రభావం పడుతుంది. మారే ఋతువులు, మార్పే వాతావరణం, ఎండ, చెమ్మ, అస్వస్థత, ఆందోళన, కుళాయి నీళ్ళల్లో కలిసిన క్లోరిన్. ఇవి సరే...జుట్టు వూడి, రాలి పోవడానికి వీటన్నిటి కన్న ముఖ్యమైన కారణం, దానికి సరియైన ప్రమాణంలో పోషణ అందక పోవడం. మరి ఒచ్చే చిక్కేమిటంటే, మీకు బజార్లో ఎక్కువగా దొరికే కేశ సంరక్షణ కోసం వాడే నూనెలు శుద్ధ మైనవి కాకపోవడం. దాంతోటే, ఆధునిక నాగరికత మోజులో పడి ప్రకృతి సహజమైన నూనెలపైన విముఖత పెరగటంతో యిది మరీ చిక్కు సమస్య అయింది.

**కొబ్బరి నూనె తర తరాల నుంచీ, అంటే మీ అమ్మగారి, వాళ్ళమ్మగారి, వాళ్ళ అమ్మమ్మ గారి అందమైన తలకట్టు, జుట్టులోని కీలకం.**



శతాబ్దాలబట్టీ స్త్రీలు శుద్ధమైన, తాజా కొబ్బరి నూనె వాడి ఒత్తయిన జుట్టు పెంచుకుంటూ ఆ జుట్టు ఊడిపోకుండా కాపాడుకుంటూన్నారు.




**అసలు కొబ్బరినూనె పరిశుద్ధత, తాజాదనం ఋజువు చేసుకోడానికి 3 ఉపాయాలు :**



మీరు వాడే కొబ్బరి నూనెను పారాచూట్ కొబ్బరి నూనెతో పోల్చి చూడటానికి తేలికైన 3 పరీక్షలని చెయ్యండి.

1. చూడండి. ఆ నూనె పారదర్శకమై అటూ యిటూ కనిపించేలా ఉండాలి.
2. వాసన చూడండి, ఇది పాచి వాసన లేకుండా, తాజాగా సరియైన వాసనతో ఉండాలి.
3. ఈ నూనె సరిగ్గా, ఆగకుండా, సహజంగా పారగలిగి ఉండాలి.

మరి మీ జుట్టుకు యీ పరీక్షలకి నిలవ గలిగిన శుద్ధమైన, తాజాదనంగల కొబ్బరి నూనెనే రాసుకోండి.

# పారాచూట్

**కొబ్బరి నూనె—**

**నూనెల్లో సర్వోత్తమం, ప్రకృతి సహజత్వం, పరిశుద్ధత, తాజాదనం, వీటి సంగమం.**

**స్వచ్ఛంగా, తాజాగా, సువాసనతో, బలాన్నిచ్చే వాటితో నిండినది.**



'బంగారు కానుక'లో నాగేశ్వరరావు, సుజాత

## డబ్బు ! డబ్బు ! డబ్బు ! లో తోడుదొంగలు

గోవిందు (నూతన్‌ప్రసాద్) ఇంటికి కొండమ్మ (రమాప్రభ) వచ్చింది. "అమ్మగారికి ఏం మంత్రం వేశావేంటి — ఉన్నట్టుండి నామీద జాలి చూపిస్తున్నావు ? ఏదయితేనేం, కొండమ్మా ! ఇకనుంచి నువ్వూ నేనూ చిలకాగోరింకల్లాగా, ఎద్దూ జీతగాళ్ళలాగా కలిసిమెలిసి ఉందాం," అన్నాడు గోవిందు.

## సినిమా

"సర్లే... ఇది వంటగది అంటున్నావు. స్టౌను, గరిటెలు, గిన్నెలూ సరంజామా అంతా ఏం కనపడవేంటి ? ఇదిగో... నీ సంగతి నాకు బాగా తెలుసు. ఏదీ నీ పెట్టె ?" అంటూ కొండమ్మ ఇటు అటు చూసింది. పక్కనే ఓ పాత పెట్టె కనిపించింది.

"అమ్మమ్మా ! మగవాళ్ళ పెట్టె ఆడవాళ్ళు తెరవకూడదు. అందులో చాలా చాలా ఇబ్బంది అయినవి ఉంటాయి."

"ఏం ఫర్వాలేదు తాళం తియ్."

"తాళంచెవి పోయిందిగా ? పోయిందంటే పోయిందిగా ? పులుసులో పడిపోయిందిగా ?" అని గోవిందు అంటూండగానే కొండమ్మ సునాయాసంగా ఆ పెట్టె మూత తెరిచింది. అందులో దొంగిలించిన వస్తువులు కనిపించాయి. గోవిందు దీనంగా "కొండమ్మా, కొండమ్మా ! నీకు దణ్ణం పెడతాను. ఏదో అలవాటు ప్రకారం చేతిపని చేశాను. అమ్మగారికి చెప్పొద్దు," అంటూ బ్రతిమాలాడు.

"నేనెందుకు చెబుతాలే — నాకూ ఇదే అలవాటుగా ? ఇదిగో... బంగారం గుడ్లు పెట్టే బాతును ఒక్కసారే కోసేస్తే, ఒక్క గుడ్డే దొరుకుతుంది. కాస్త ఓపిక పట్టావనుకో — రోజుకొక గుడ్డు దొరుకుతుంది. అప్పుడు వాటా తీసేసుకుందాం. ఏమంటావ్ ?"

"ఆహా ! ఎంత చక్కగా చెప్పావు లగాయిమ్మా ! ఇకనుంచి నువ్వే నాకు తల్లివి, తండ్రివి, గురువ్వి, పెళ్ళాంగారివి," అంటూ గోవిందు తెగ మురిసిపోయాడు.

విజయబాపినీడు నేతృత్వంలో మాగంటి రవీంద్రనాథ్ చౌదరి నిర్మించిన శ్యాంప్రసాద్ ఆర్ట్స్ ప్రొడక్షన్స్ "డబ్బు ! డబ్బు ! డబ్బు !" చిత్రానికి జి. రామమోహనరావు దర్శకుడు.



'సుబ్బారావుకి కోపం వచ్చింది'లో నారాయణరావు, కల్పనా అయ్యర్ 'తల్లీ కొడుకుల అనుబంధం'లో కృష్ణంరాజు, కె. ఆర్. విజయ, జయప్రద

# సినిమా

## యు. విశ్వేశ్వరరావు చిత్రాలు

"కంచుకోట, దేశోద్ధారకులు" వగైరా హిట్ చిత్రాలు, "తీర్పు, మార్పు, నగ్నసత్యం, హరిశ్చంద్రుడు" లాంటి సంచలన చిత్రాలు అందించిన యు. విశ్వేశ్వరరావు నవంబర్‌లో మొదలెట్టే "కీర్తి–కాంత–కనకం"లో నటించే వారందరూ కొత్తవారే. కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం కూడా ఆయనదే. ఆయనతోపాటు కొండవీటి వెంకటకవి సంభాషణలు రాస్తున్నారు. టి. చలపతి రావు సంగీతం, జి. మోహనకృష్ణ ఛాయ, ఆర్. హనుమంతరావు కూర్పు, పి. జి. మోహన్ సహకార దర్శకత్వం నిర్వహిస్తున్నారు. డిసెంబర్ మొదటి వారానికి చిత్రీకరణ పూర్తవుతుంది. ఆ తర్వాత నూతన నటవర్గంతో తయారయ్యే మరో సంచలనాత్మక చిత్రం "తిరుగుబాటు". ఎన్. టి. ఆర్‌తో 1982లో "కంచుకాగడా" భారీ చిత్రాన్ని ప్రారంభిస్తారు. ★




(గత సంచిక తరువాయి)

శ్రీధర్ చాలా చలాకీగ ఎప్పుడూ నవ్వుతూ, నవ్విస్తూ వుండేవాడు కానీ తనే బాబుని మర్చిపోలేక, నవ్వురాక దిగులుగా వుండేది

మూడు నెలలు గడిచాయి ఒకరోజు రాత్రి శ్రీధర్ అడిగాడు—

"శారదా! నువ్వదోలా వుంటున్నావు కారణం చెప్పవూ?" అని

ఏం చెప్తుంది! ఎలా చెప్తుంది!

"శారదా! నీ తల్లితండ్రుల్ని, తోబుట్టువుల్ని వదిలి నాతో వచ్చావు నేను భర్తనే కాదు! స్నేహితుడ్ని, శ్రేయోభిలాషిని! నీ బాధలు, సంతోషాలు నావి! వచ్చినప్పట్నించీ చూస్తున్నాను నీ కళ్లల్లో ఏదో దిగులు, ముఖంలో విచారం నువ్వు మనసులో ఎందుకో బాధపడుతున్నావు! నీ కష్టం ఏమిటో నాకు చెప్పు శారదా! అవసరమైతే ప్రాణాలైనా ఇచ్చి ఆ కష్టం తొలగిస్తాను"

అతని మాటలు తనని విలువగా కదిలించి వేశాయి తనంటే అంత అభిమానం చూపే శ్రీధర్ కోసం ఏదైనా చేయాలనిపించింది

ఇక జీవితంలో శ్రీధర్‌ని బాధపెట్టకూడదని నిర్ణయించుకుంది

ఆ తర్వాత తనలో కొద్దిగా మార్పు వచ్చింది బేబీ పుట్టాక తన జీవితం పర్వతాలమీద గంతులేస్తూ గలగల ప్రవహించే సెలయేరులా సాగిపోయింది

కాని ఇంతలో

శారద ఏదో చప్పుడవడంతో వులిక్కిపడింది టేబిల్‌మీద వున్న గాజుగ్లాసు లీల చెయ్యి తగిలి క్రిందపడి బ్రద్దలైంది

"శారదగారూ! మిమ్మల్ని చూస్తే జాలి కలగడం లేదండీ! కోపం వస్తోంది మీరు క్రొత్త కాబట్టి వూరుకున్నాను లేకపోతే ఛడామడా తిట్టేసేదాన్ని!"

ఈ రాత్రి ఇక్కడ వుండి చాలా పొరపాటు చేశాననుకుంది-శారద

"పన్నెండేళ్ల క్రితం వదిలేసిన కొడుకోసం ఇప్పుడొచ్చారు అది కూడా మీ భర్త, పాప చనిపోయాక ఇంక ఏ ఆధారం లేకపోతే వాడు జ్ఞాపకం వచ్చి వెదుక్కుంటూ వచ్చారు. మీరు నిజంగా బాబుని కన్నతల్లేనా! ఈ లోకంలో తల్లి బిడ్డల అనుబంధం కూడా స్వార్థంతో ముడివేసుకుందా? ఇక ఈ ప్రపంచం ఏమైపోతుందో గదా!" అంది లీల రెండు చేతులూ జోడిస్తూ

శారద మాట్లాడలేదు

"పాపం! ఇన్నాళ్లూ ఆ బాబు అమ్మకోసం ఎంత తల్లడిల్లిపోయి వుంటాడోగదా! తల్లీ, తండ్రీ లేని పిల్లల్ని ఈ లోకం ఎంతో చిన్నచూపు చూస్తుంది అందరూ అనాధని హేళన చేస్తుంటే ఆ చిన్నిమనస్సు అమ్మకోసం ఎంత ఏడ్చిందోగదా! ప్రేమగా హృదయానికి హత్తుకుపోయి పాలు తాగాల్సిన వయసులో, ఆకలితో ఏడ్చి ఎంత సొమ్మసిల్లిపోయాడో! తల్లి ఒడిలో పడుకుని హాయిగా నిద్రపోవాల్సిన సమయంలో ఏ కటికనేలమీద పడుకుని నిద్రపోయాడో! ఏ చిన్నబాధ కలిగినా, సంతోషం కలిగినా ఎవరితో చెప్పుకుని వుంటాడు? తనలాంటి చిన్నారి బాబులు అమ్మా, నాన్న చేతులు పట్టుకుని కేరింతలు కొడుతూ నడుస్తుంటే వాళ్లని చూసి ఎంత !"

"ఇక చెప్పకండి ప్లీజ్!"

శారద రెండు చేతుల్తోనూ చెవులు మూసుకుంది

లీల శారదవేపు తీక్షణంగా చూస్తూ —

"మీరు వినడానికే ఇంత బాధపడుతున్నారే కానీ హాయిగా ఆడుతూ, పాడుతూ తిరగాల్సిన కాలం, మానవజీవితంలో అత్యంత మధురమైన బాల్యావస్థ ఎంత భయంకరంగా గడిచిందో మీరు వూహించగలరా! పిల్లల్ని కనగానే సరిపోదండీ వాళ్లని ప్రేమతో పెంచి పెద్దవాళ్లను చెయ్యాలి అలా పెంచే శక్తీ, ధైర్యం లేనప్పుడు వాళ్లని ఈ లోకంలోకి తీసుకొచ్చే అధికారం కూడా మీకు లేదు ఆ బాబే కనుక చదువూ, తెలివితేటలు గలవాడైతే మిమ్మల్ని ఈ ప్రశ్నలే అడుగుతాడు మిమ్మల్ని అసహ్యించుకుంటాడు మీ ముఖం కూడా చూడడు అంతే అంతే అలాగే జరుగుతుంది జరగాలి కూడా!"

అక్కడ్నించి లేచి, మంచంమీద పడుకుని దుప్పటి ముసుగేసుకుంది లీల

శారద శిలలా కూర్చుండిపోయింది

అవును! తను దుర్మార్గురాలు, పాపాత్మురాలు కాని అదంతా తను కావాలని చెయ్యలేదు తను విధి చేతిలో కీలుబొమ్మ

లీల అన్నట్లు బాబు తన దగ్గరకు రాడా! తనని అసహ్యించుకుంటాడా! ఊహు! అలా జరగదు! ఒకవేళ అలా జరిగితే తను భరించగలదా! బాబుమీదే ఎన్నో ఆశలు పెట్టుకు వచ్చింది బాబు లేకపోతే ఒంటరిగా తను జీవించలేదు బాబు కోసం తన ప్రాణం ఎలా కొట్టుకుపోతోందో!

తన మనస్సు ఎంత ఆరాటపడుతోందో లీలకేం తెలుసు!

తను పొరపాటు చేసింది నిజమే!

కాని ఇక దాన్ని సరిదిద్దుకునే అవకాశం లేదా!

లీల అన్నట్లు బాబు ఎన్నో అవస్థలుపడి వుండవచ్చు కాని ఇక ఇప్పట్నించీ వాడిని తన గుండెల్లో దాచుకుంటుంది

ఎంతో ప్రేమతో పెంచుతుంది బాబులేనిదే తనుండలేదు తన బ్రతుకిప్పుడు వాడిమీదే ఆధారపడివుంది ఎన్ని కష్టాలు పడైనాసరే, బాబెక్కడున్నాడో తెలుసుకుని, వాడిని తీసికెళ్లందే తను ఇంటికి తిరిగి వెళ్లదు! గట్టి నిర్ణయం తీసుకుంది శారద

* * *

రాఘవరావు గుంటూరులో పేరు పొందిన సర్జను ఆయన్ని గూర్చి తెలియనివాళ్ళు ఎవ్వరూ లేరు

శారద గుంటూరు బస్సుస్టాండులో బస్సు దిగి, దగ్గరగా వున్న హోటల్లో రూము తీసుకుంది స్నానం, భోజనం కానించి కాస్సేపు విశ్రాంతి తీసుకుని డాక్టరుగారింటికి బయలుదేరింది

రిక్షావాడు సరాసరి రాఘవరావు ఇంటి ముందు రిక్షాని ఆపి –

"ఇదేనమ్మా డాక్టరుబాబు ఇల్లు!" అన్నాడు

శారద రిక్షాదిగి డబ్బులిచ్చేసింది ఎదురుగా కన్పిస్తున్నా రాఘవరావు మేడను చూసి ఆశ్చర్యపోయింది మేడ ఖరీదైన సినిమా సెట్టింగులా వుంది

ఆ మేడనుబట్టే ఆయనకెంత ప్రాక్టీసువుందో వూహించవచ్చు గేటు తీసుకుని లోపలకు వెళ్లింది శారద

మేడ ముందు పెద్ద పూలతోట ఎండలో వచ్చిన శారదకి పూలతో, పచ్చని ఆకులతో కళకళలాడుతున్న ఆ తోటని చూడగానే ఎంతో ఆహ్లాదం కలిగింది

లోపలకు ఒక్క అడుగువేసి, ఆగిపోయింది ఇంకా లోపలకు వెళ్లడానికి ఏదో జంకు కలిగింది

ఈయన చూడబోతే చాలా పెద్దడాక్టరులా వున్నాడు ఈయన తనతో మాట్లాడతాడా! అసలు కన్నెత్తి అయినా చూస్తాడా! తను చెప్పింది వినగానే ఏమంటాడో!

కానీ ఒకందుకు తనకు చాలా ఆనందగావుంది తన బాబు ఈ మేడలో చిన్న యువరాజులా జీవిస్తూ వుంటాడు ఎంత దర్జాగా, రీవిగా వుంటాడో!

"ఎవరు కావాలమ్మా?"

శారద ప్రక్కకు తిరిగి చూసింది పని కుర్రాడనుకుంటా నిలబడివున్నాడు

"డాక్టరుగారున్నారా?" అనడిగింది శారద

"ఆ! వున్నారమ్మా! కానీ ఇప్పుడెవర్నీ చూడరు మీరు నాలుగ్గంటలకు రండి" అన్నాడు

"నేను పేషెంటుని కాదు బాబూ! ఆయనతో ఒక విషయం మాట్లాడాలి!"

"ఏదయినా సరే! మీరు నాలుగ్గంటలకు రండి అప్పుడు మాట్లాడుతారు!" అని వెనుదిరిగ బోయాడు

శారదకు నిరుత్సాహం కలుగుతోంది

నాలుగ్గంటలకు అప్పటివరకూ బాబుని గూర్చి తెలుసుకోకుండా, బాబుని చూడకుండా ఎలా వుండడం! వుహూ తన వల్లకాదు

"బాబూ! చాలా అర్జంటు! నేను మళ్లీ వూరు వెళ్లిపోవాలి ఆయనకి ఒక్కసారి చెప్పరా" అని బ్రతిమిలాడింది శారద

ఆ కుర్రాడు ఏమనుకున్నాడో ఏమోగానీ –

"సరే! వుండండి అయ్యగారితో చెప్పి వస్తాను" అని లోపలికెళ్లి పది నిముషాల్లో తిరిగొచ్చాడు

"రండమ్మా! అయ్యగారు మీతో మాటాడతానన్నారు"

శారదకి ప్రాణం లేచొచ్చినట్లయింది

గబగబా అతని వెంట వెళ్లింది అతడు ముందుగది కర్టెను తొలగించి – "లోపలకు వెళ్లి కూర్చోండి!" అని చెప్పి వెళ్లిపోయాడు

శారద లోపలకు వెళ్లింది ఎ సి రూములో అడుగుపెట్టినట్లుంది ఎదురుగా టేబిల్, దాని ముందు కుర్చీలు కనపడ్డాయి శారద వెళ్లి ఒక కుర్చీలో కూర్చుంది బ్లూ డిస్టెంపర్ కొట్టిన గోడలు ఆ గోడలకు అందమైన పెయింటింగ్స్ వాటిని చూస్తూ వుండిపోయింది

ఇంతలో బయట బూట్లచప్పుడు విన్పించింది శారద చటుక్కున లేచి నిలబడింది నైలాన్ కర్టెన్లు తొలగించుకుని ఒక నలభై అయిదేళ్ల వ్యక్తి లోపలకు వచ్చాడు ఎర్రగా, పొడవుగా, హుందాగా వున్నాడు

"కూర్చోండి"

శారదవేపు చూసి అన్నాడు

శారద కూర్చుంది

ఆయన రివాల్వింగ్ చెయిర్లో కూర్చున్నాడు

"ఏవిటో మాట్లాడాలన్నారుట, చెప్పండి" అన్నాడు

ఆయన ముఖంలో కనపడుతున్న చిరాకుని చూస్తుంటే శారద నోట్లోంచి మాటరావడంలేదు చేతిలో వున్న కర్చీఫ్‌తో ఒకసారి ముఖం తుడుచుకుని మెల్లిగా అంది –

"మీరు రాజమండ్రి హాస్పిటల్లో వున్నప్పుడు మరియమ్మ అనే నర్సు దగ్గరనుండి ఒక బాబుని తెచ్చుకున్నారు గదా!"

ఆ మాటలు వినగానే రాఘవరావు ముఖంలో రంగులు మారాయి

"అవును!"

"ఆ కుర్రాడు నా కొడుకు!"

"ఏవిటి!" ఆశ్చర్యంతో ఆయన కళ్ళు పెద్దవయ్యాయి "కిశోర్ మీ బాబా!" అన్నాడు

ఆ పేరు వినగానే శారదకి ఆశ్చర్యం, ఆనందం రెండూ కలిగాయి కిశోర్ కిశోర్ పేరు ఎంత చక్కగా వుంది తన బాబు నిజంగా కిశోరమే!

"మాట్లాడరే?"

శారద ఉలిక్కిపడి, 'అవునండీ!" అంటూ జరిగింది చెప్పింది

అంతా విని ఆయన చిన్నగా నిట్టూర్చాడు

"డాక్టరుగారూ! నా బాబుని మీరు తెచ్చుకున్నారని తెలిగానే ఎంతో ఆనందం కలిగింది మీవంటివారి దగ్గరుంటే చాలా బాగా పెరుగుతాడు పిల్లల సక్రమమైన పెరుగుదలకి పుట్టుక కంటే, పెరిగే వాతావరణమే ఎక్కువ దోహదం చేస్తుంది కదా! బాబు ఏం చదువుతున్నాడండీ! ఇప్పుడు ఇంట్లో వున్నాడా! స్కూలు కెళ్ళాడా!"

ఆత్రంగా అడిగింది

రాఘవరావు పేపర్ వెయిట్ చేతిలో పుచ్చుకుని తిప్పుతూ దాని వేపే చూస్తున్నాడు

శారద ఆయన నోట్లోంచి వెలువడే మాట కోసం చూస్తోంది

'ఏవిటీ ఈయన సమాధానం చెప్పడు! బహుశ నేను బాబుని తీసికెడతానని భయపడుతున్నాడా! అంతే అయివుంటుంది బాబుని ఎంతో ఇష్టంతో తెచ్చుకున్నాడు ఇప్పుడు తిరిగి తనకిస్తాడా! బాబుని ఇవ్వనంటే ఏం చెయ్యాలి! పెద్ద చిక్కొచ్చి పడిందే! ముందు బాబుని ఒక్కసారి కళ్లతో చూడాలి! ఆ తర్వాత ఈయన కాళ్లమీద పడైనా ఒప్పించాలి, అనుకుని –

"బాబు స్కూలుకి వెళ్లాడాండీ! తిరిగి ఎన్ని గంటలకు వస్తాడు" అంది

**జరిగిన కథ – 3:** రకరకాల దొంగతనాలలో ఆరితేరిన ఓ కుర్రాడి మూలంగా భర్త శ్రీధర్, కూతురు నేబీ ఇద్దరూ ఆక్సిడెంట్‌కు గురికాగా ఒంటరిదవుతుంది శారద తర్వాత పోలీసులు ఆ కుర్రాడ్ని అరెస్ట్ చేస్తారు 'నీకు ఇంకో పాప వుంటే బావుండేది' అన్న పక్కింటి కమల మాటలకు, గతంలో ఓ నర్సుకు అప్పగించిన తన బాబు కోసం రాజమండ్రి బయలుదేరుతుంది రైల్లో ఆమె మనసు గతాన్ని తన కళ్ల ముందుంచుతుంది శారద, నిరంజన్ ఒకర్నొకరు గాఢంగా ప్రేమించుకొని, పెద్దలతో మాట్లాడి పెళ్లి చేసుకోవాలని నిశ్చయించుకొంటారు తరచూ అతన్ని పార్కులో కలిసే శారద ఈసారి నిరంజన్ అర్థింపుతో అతని గది కెళ్లటానికి నిశ్చయించుకొంటుంది గది కెళ్లిన శారద నిరంజన్ వత్తిడులకు లొంగిపోతుంది తరచు ఇద్దరూ తమ కోరికలు తీర్చుకుంటుంటారు ఫలితంగా శారద గర్భవతి అవుతుంది త్వరలో పెళ్లి చేసుకుంటానని ఆమెకు హామీ ఇస్తాడు నిరంజన్ ఆ తర్వాత మళ్లీ కనిపించలేదు అతను శారదకు పుట్టిన బిడ్డను నర్సుకి ఇచ్చేస్తుంది ఆమెతల్లి శ్రీధర్‌తో శారద కొత్త జీవితాన్ని ప్రారంభిస్తుంది

"బాబు నా దగ్గర లేడమ్మా!" అన్నాడు ఆయన మెల్లిగా!

శారద తెల్లబోయింది

బాబు లేడా ఎక్కడున్నాడు! ఈయన అబద్ధం చెప్తున్నాడు నా వూహే నిజమైంది బాబుని చూపిస్తే, తను తీసికెళ్లిపోతానేమోనని, అసలు లేడనే చెప్తున్నాడు బాబు తల్లినే ఒక్కసారి కన్నకొడుకుని చూస్తానని అడుగుతోంటే ఎంత నిర్దాక్షిణ్యంగా మాట్లాడుతున్నాడు?

శారదకి కోపం వచ్చింది అయినా అవసరం తనది కాబట్టి కోపం అణచుకుంది

"బాబు లేడా?"

"అవునమ్మా!"

ఆయనలా అంటోంటే శారదకి దుఃఖం కూడా వచ్చింది

"బాబుని ఒక్కసారి చూసి వెడతానండీ!"

రాఘవరావు ముఖం వివర్ణమైంది

"మీరు నా మాటలు నమ్మటంలేదా! నిజంగా చెప్తున్నాను! బాబు నా దగ్గర లేడమ్మా!"

"మరి ఎక్కడున్నాడండీ," చిరాగ్గా అడిగింది

"మీరు స్థిమితంగా వుంటే అన్నీ చెప్తాను!" అని – "మీ పేరు!" అనడిగాడు

"శారద!"

"శారదగారూ! మీరు నన్ను క్షమించాలి!" అన్నాడు బాధగా

అప్పటికి నమ్మకం కుదిరింది శారదకి! అయితే తన బాబు ఎక్కడున్నాడు! శారద ముఖం వెలవెలబోయింది

రాఘవరావు చెప్తున్నాడు –

"మా ఆవిడకి పిల్లలంటే పిచ్చి! మాకు పెళ్లయిన పదేళ్ళకి ఆవిడ మొదటిసారిగా గర్భవతి అయింది! అప్పుడు మేము ఎంత సంతోషించామో చెప్పలేను! కాని దురదృష్టవశాత్తు బిడ్డ పుట్టి చచిపోయాడు ఇక మా ఆవిడ పిచ్చిదానిలా తయారయింది! ఒకరోజు హాస్పిటల్‌కి వచ్చినపుడు అక్కడ తిరుగుతున్న మరియమ్మ బాబుని చూసింది ఆవిడకి ఆ బాబు ఎంతో నచ్చాడు రోజూ వాడిని ఇంటికి తెచ్చుకుని ముద్దు చేస్తుండేది వాడిని చూడకుండా ఒక్క రోజు కూడా వుండలేకపోయేది!

# కోరిక తీరే వేళ

ఇంతలో మాకు అక్కడనుంచి ట్రాన్స్‌ఫర్ వచ్చింది బాబుని వదిలిరానని మా ఆవిడ ఒకటే గొడవ! ఆవిడ కోసం మరియమ్మ నడిగి బాబుని పెంచుకోడానికి తెచ్చుకున్నాం! అప్పటికి బాబుకి అయిదేళ్లుంటాయేమో!

మేము ఇక్కడికొచ్చాం! కిశోర్ అని పేరు పెట్టుకుని ఎంతో గారాబంగా పెంచసాగింది ఆ తర్వాత ఏడాదికి మాకు కవలపిల్లలు ఒక బాబు, పాప పుట్టారు! అంతా కిశోర్ వచ్చిన వేళావిశేషమని పొంగిపోయాం కొన్నాళ్లకి మా ఆవిడలో ఏదో మార్పు రావడం కన్పించింది. కిశోర్‌ని విసుక్కునేది, తిట్టేది నేను హాస్పిటల్ వర్క్‌తో ఎప్పుడూ బిజీగా వుండేవాడిని ఇంట్లో వుండే సమయం తక్కువ వున్న సమయంలో కూడా ఇటి విషయాలు పెద్దగా పట్టించుకునే వాడినికాదు

కాని ఒకరోజు నేను ఇంటికొచ్చేసరికి కిశోర్ వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు దగ్గరికెళ్ళి చూసేసరికి వంటినిండా ఎర్రటి వాతలు కన్పడ్డాయి వాడికి మందు రాసి – మా ఆవిడ్ని అడిగాను పాపని కొట్టాడుట. దానికి ప్రతిఫలంగా బెల్టుతో వాడి వీపు చిట్లగొట్టిందిట నాకు ఎవర్నేం అనాలో తోచలేదు కానీ బాబుని ఇక ఈ ఇంట్లో వుంచడం మంచిది కాదని మాత్రం అన్పించింది"

రాఘవరావు ఆగాడు

శారద ఆయనవేపే చూస్తూ, శ్రద్ధగా వింటోంది

"కిశోర్‌ని ఏ బోర్డింగు స్కూల్లోనో చేర్పిస్తే బాగుండు ననుకున్నాను ఆ సమయంలోనే నా స్నేహితుడు చిన్నారావు వచ్చాడు వాడు లక్షాధికారి వాడికున్న ఒకే ఒక కొడుకు యాక్సిడెంటులో చచిపోయాడు మాటల సందర్భంలో నేను కిశోర్ విషయం చెప్పగానే, తను పెంచుకుంటానని అన్నాడు నేను కిశోర్‌ని అతనితో పంపేశాను తర్వాత నేను ఫారిన్ వెళ్లిపోయాను. ఆరునెలల క్రితమే తిరిగొచ్చాను కానీ మళ్లీ కిశోర్ విషయం తెలుసుకోలేదు" అన్నాడు

శారద గుండె బరువెక్కినట్లయింది

## వంటింట్లో పురుషులు!

ఇటీవల పశ్చిమ జర్మనీలో జరిపిన ఒక సర్వేలో కొంతమంది పురుషులు, స్త్రీలకు బదులు యింటి పనిని చేయడానికి సంసిద్ధతను వ్యక్తం చేశారు. 16–29 సంవత్సరాల వారిలోనూ, ఉన్నత విద్య నభ్యసించినవారిలోనూ యీ ధోరణి ఎక్కువగా వుంది అయితే వుద్యోగాలలో ఒక ఉన్నత స్థానాన్ని పొందినవారిలో మాత్రం యిది తక్కువగా వుంది స్త్రీలలో 28 శాతం తమ భర్తలకు బదులు సంపాదనా బాధ్యతలను స్వీకరించడానికి సిద్ధమయ్యారు అయితే ఎక్కువ మంది స్త్రీలు దీనిని వ్యతిరేకించారు. 45–69 సంవత్సరముల మధ్య గల స్త్రీలు యీ విషయం వూహించడం కూడా కష్టంగానే వుందన్నారు.

'మళ్లీ తెలుసుకోలేదు'

ఎంత నెమ్మదిగా చెప్తున్నాడు!

ఎందుకు తెలుసుకుంటాడు! ఆయన కొడుకైతే గదా! అవసరానికి తెచ్చుకున్నాడు ఆ తర్వాత పనికిరాని వస్తువులా అవతల పారేశాడు

ఇక క్షణం కూడా అక్కడ కూర్చోలేకపోయింది

"ఆ స్నేహితుడి అడ్రసు ఇవ్వగలరా?"

"ఆ! ఇస్తాను" అని –

లోపలికెళ్లి పావుగంటలో తిరిగొచ్చాడు ఆయన ఇచ్చిన కాగితం పుచ్చుకుని బ్యాగ్‌లో పెట్టుకుంది

"అది హైదరాబాద్ దగ్గర ఒక పల్లెటూరు" అంటూ ఎక్కడ దిగాలో, ఎలా వెళ్లాలో వివరాలు చెప్పాడు రాఘవరావు

"థాంక్స్! వస్తానండీ" అని చెప్పి తను బయటికొచ్చింది శారద








# మైసూర్ శ్యాండల్



**గొప్ప భారతీయ సంప్రదాయంలో విశిష్టమైన స్నానపు సబ్బు**

కర్నాటక సోప్స్ అండ్ డిటర్జెంట్స్ లిమిటెడ్, బెంగుళూరు (ముందటి గవర్న్‌మెంట్ సోప్ ఫ్యాక్టరి, బెంగుళూరు)
వారి ఒక నాణ్యమయిన ఉత్పాదన. మార్కెట్ చేయువారు: మైసూరు సేల్స్ ఇంటర్నేషనల్ లిమిటెడ్, బెంగుళూరు

MCA-MSS-62-TEL







రిక్షా ఎక్కి హోటల్ రూముకొచ్చింది తల బ్రద్దలయిపోతున్నట్లుగా వుంది కాఫీ తెప్పించుకుని త్రాగింది ఫ్యాన్ ఫుల్ స్పీడులో పెట్టుకుని మంచంమీద వాలిపోయింది శారద కళ్లు మూసుకుంది

కాని మనసులో డాక్టరు గారి మాటలే మెదులుతున్నాయ్

బాబుని కర్రతో కొట్టిందిట ఆవిడసలు మనిషా? రాక్షసా! తన బాబు ఇక్కడ లేకపోవడం ఒక విధంగ మంచిదే! లేకపోతే ఈ రాక్షసులు వాడిని నిలువునా చంపేసేవారు

బాబు ఆ స్నేహితుడింట్లో ఎలా వున్నాడో! అక్కడెన్ని బాధలు పడుతున్నాడో! వెంటనే వెళ్లాలి! బాబుని చూడాలి!

అసలీ క్షణాన వెళ్లి రైల్లో కూర్చోవాలని వుంది కాని రాత్రి అవుతోంది ఇప్పుడెక్కడి కెడుతుంది?

ఇదివరకెప్పుడూ ఒంటరిగా బయటికి రాలేదు తనిలా వూళ్లు తిరగడం — హోటళ్లో వుండడం తన ఈ ధైర్యం తనకే ఆశ్చర్యం కలిగిస్తోంది మనిషిలో అంతర్లీనంగా వున్న శక్తుల్ని పరిస్థితులే బయటపెడ్తాయన్నమాట తనకిప్పుడు బాబు తప్ప మరో ప్రపంచం కనబడ్డంలేదు

ఎలాగైనా తన పని సాధించుకోవాలి బాబుని ఇంటికి తీసికెళ్లాలి — అంతే!

* * *

శారద ట్రెయిన్ దిగి చుట్టూ చూసింది!

చిన్న స్టేషన్!

ఆ స్టేషన్‌లో రైలు దిగింది శారద ఒక్కతే!

స్టేషన్ నుంచి వూళ్లోకి నాలుగు మైళ్ల దూరం వుంటుంది వూళ్లోకి వెళ్లాలంటే ఎద్దుబళ్లు వుంటాయని డాక్టరుగారు చెప్పారుగదా అనుకుంటూ శారద స్టేషన్ బయటికొచ్చింది! కానీ ఒక్క బండీ కూడా కనబడలేదు!

అప్పుడే సూర్యుడు పడమటి కొండలవేపు నరిగెడుతున్నాడు చీకటి తెరలు మెల్లమెల్లగా వ్యాపిస్తున్నాయి

## కోరిక తీరే వేళ

రైలు మధ్యాహ్నం రావల్సింది! నాలుగ్గంటలు లేటు! ప్చ్! ఇప్పుడేం చెయ్యాలి!

నాలుగు మైళ్ళు నడిచివెళ్లడమంటే మాటలు కాదు! అందులోనూ పల్లెటూరుకి దిగాలుగా నిలబడిపోయింది

"ఏమ్మా! ఎక్కడికెళ్లాలి?"

తలత్రిప్పి చూసింది శారద!

ఎవరో పల్లెటూరి వ్యక్తిలా వున్నాడు

"ఎవరింటికెళ్లాలమ్మా?" మళ్లీ ఆయనే ప్రశ్నించాడు

చెప్పనా? వద్దా? అని క్షణంసేపు తటపటాయించింది శారద! చివరికి — చెప్పటమే మంచిది!

### స్టీరియో టెలివిజన్!

స్టీరియో టెలివిజన్లు తయారుచేసి పశ్చిమ జర్మనీ ఎలక్ట్రానిక్ రంగంలో మరో ముందంజ వేసింది స్టీరియో టెలివిజన్లు నేరుగా 'స్టీరియో సౌండ్'ను అందుకోగలవు అయితే వీటిని తయారుచేసి మార్కెట్లో విడుదల చేయటానికి మరో మూడేండ్లు పట్టవచ్చు ఇటీవల పశ్చిమ బెర్లిన్‌లో జరిగిన ఎలక్ట్రానిక్స్ ప్రదర్శనలో వీటిని ప్రదర్శించారు. ఈ ప్రదర్శనలో 27 దేశాలకు చెందిన 332 సంస్థలు పాల్గొన్నాయి శ్రవణ రంగంలో సి డి డిస్కులు అందర్ని ఆకర్షించాయి ఫిలిప్స్ కంపెనీ వారు కనుగొన్న పి డి డిస్కులను జపానులోని సోని కంపెనీవారు వ్యాపారరీత్యా తయారు చేయనున్నారు నాలుగు అంగుళాల వ్యాసం కల్గిన డిస్కులు 60 నిమిషాలపాటు పాటలను లేక యితర కార్యక్రమాలను విన్పించగలవు లేజర్ సౌండ్ పికప్‌ను వుపయోగించటం వలన వీటి జీవితకాలం అనంతం అని భావిస్తున్నారు

తనిప్పుడు అనవసర మొహమాటానికిపోతే ఇబ్బంది పడిపోతుంది, అనుకుని—"చిన్నారావుగారింటికండీ," అంది

ఆయన శారదవేపు ఆశ్చర్యంగా చూశాడు!

"చిన్నారావుగారా! ఆయన" ఏదో చెప్పబోయి ఆగిపోయాడు

"చెప్పండి! ఆగిపోయారే! ఆయన వూళ్లో లేరా?" శారద కంఠంలో నిరాశ, బాధ తొంగి చూస్తున్నాయి

"అహ! అదికాదమ్మా! ఈ సమయంలో వూళ్లోకి వెళ్లేందుకు బళ్ళు దొరకవు!"

శారద భయపడింది అయితే ఏం చెయ్యాలి! ఈ రాత్రికి ఎక్కడుండాలి! శారద మనస్సులో ఎన్నో ప్రశ్నలు తలెత్తాయి

"నేను స్టేషన్ మాష్టర్ని మా ఇల్లు ఇక్కడికి దగ్గరేనమ్మా! ఈ రాత్రి మా ఇంట్లో వుండు రేప్రొద్దున్న ఊళ్లోకి వెళ్లొచ్చు"

శారద సందేహంగా చూసింది ఆమె అనుమానాన్ని గ్రహించినవాడిలా —

"ఇంట్లో నా భార్యా పిల్లలూ వున్నారు మా పెద్దమ్మాయికి నీ వయసే వుంటుందమ్మా!"

ఆయనకి తన మనసులో విషయం తెలిసిపోయిందుకు శారద సిగ్గుపడుతూ —

"పదండి! మాష్టారూ!" అంది

ఆయన ముందు నడిచాడు

శారద మనస్సులో చాలా చింతపడింది నిజంగా ఈ మాష్టారు ఎంత మంచివారు ఈయనే లేకపోతే— ఈ రాత్రి వేళ ముక్కూ మొహం తెలీని ఈ ఊళ్లో తనేమైపోయేది?

ఆడది కన్పిస్తే చాలు అవమానించాలని చూసే ఈ కాలంలో, ఆడదాన్ని కామదృష్టితో మాత్రమే చూసే ఈ సంఘంలో -

ఇంత మంచివాళ్లున్నారంటే ఇంతఆప్యాయత, ఆదరణ చూపే వాళ్లున్నారంటే నమ్మశక్యం కాకుండా ఉంది

ఇటువంటి వాళ్ళు అక్కడక్కడ వుండబట్టే ఈ ప్రపంచం ఇంకా ఇలా నిలిచివుంది

(ఇంకా వుంది)

( గత సంచిక తరువాయి )

























 [ఇంకా ఉంది]

# మంచి మొగుడు

## అవధానుల సుధాకరశాస్త్రి




తెలివిగల పిల్ల అనిపించుకుని, మంచి మార్కులు తెచ్చుకున్న కామేశ్వరి చదువు పదోతరగతితో ఆగిపోయింది దానికి అక్కడితో ఫుల్‌స్టాప్ పడిపోయింది. అందుక్కారణం సిరిపురంలో కాలేజీ సౌకర్యం లేకపోవడమే.

కాలేజీలో చదువుకోవాలని ఆ పిల్లకెంత ఉబలాటంగా వున్నా లాభం లేకపోయింది. కాలేజ్ లైఫ్ అనుభవించే అదృష్టం పట్టలేదామెకి

టౌన్‌లో కాలేజీ లేకపోలేదు. కాని, ప్రతి రోజూ అయిదుమైళ్ళు వెళ్ళి, రావడమంటే మాటలు కాదంటూ— ఆ అమ్మాయి తల్లిదండ్రులు అందుకు నిరాకరించారు ఫలితంగా— కామేశ్వరి గడపదాటే అవసరం తప్పింది. పత్రికలు, నవలలు ఆమెకి కాలక్షేప సాధనాలుగా ఉపకరించేయి. యింట్లో రేడియో వుంటుంది. అదెప్పుడూ మోగుతూనే వుంటుంది. క్షణంసేపు కూడా అక్కడ్నుంచి కదలదు కామేశ్వరి. పదహారేళ్ళు నిండుతున్న కూతుర్ని చూస్తూ స్తిమితంగా వుండలేక సంబంధాలు వెదకమని భర్తని పోరసాగింది కామేశ్వరి తల్లి

ఆయన స్వతహాగా బద్ధకం మనిషి. ఓపిక తక్కువ భోజనానికి లేవమంటే కూడా చిరాకు అయిదారు పిలుపులయ్యాక ఇక గత్యంతరం లేనట్లు లేస్తాడు.

భర్త సంగతి ఆమెకి తెలీదు కనకనా! అందుకే ఆ బాధ్యతని పెద్దల్లుడికి ఒప్పగించింది

ఇలాంటి విషయాల్లో ఎంతో ఉత్సాహంగా పెద్దరికం వహించే ఆ యింటి పెద్దల్లుడు సత్యనారాయణ — ఓపిగ్గా ఓ నెల్లాళ్ళు తిరిగి, కామేశ్వరికి అన్నివిధాలా అనువైన సంబంధం వెదికి పట్టుకొన్నాడు

సిరిపురంలో పెండ్లి చూపులు ఏర్పాటయాయి.

కుర్చీలోవున్న సారధి, చాపమీద కూర్చున్న కామేశ్వరి .. ఇద్దరి తలలు ఒకేసారి పైకి లేచాయి ఒకక్షణంలో కళ్ళు-కళ్ళు కలుసుకున్నాయి చూపులు చిక్కబడినాయి రెండు మనసులు మధురంగా స్పందించేయి

ఇరుపక్షాల పెద్దలకి ఓపని తప్పింది వారిద్దరి అంగీకారం ఇక వేరే అడగాల్సిన పని లేకపోయింది

అక్కడికక్కడే తాంబూలాలు పుచ్చుకున్నారు

సారధి కళ్ళతోనే కామేశ్వరిదగ్గర వీడ్కోలు తీసుకుని వెళ్ళిపోయాడు

రెండు నెలలు గిర్రున తిరిగిపోయాయి...

నిశ్చయించుకున్న ముహూర్తం వచ్చేసింది,

సిగ్గుల మొగ్గలా తలవంచుకు కూర్చున్న కామేశ్వరి మెళ్ళో మూడుముళ్ళు వేసాడు సారధి

కుమారి-శ్రీమతి అయింది

కన్నెపిల్ల-ఇల్లాలుగా మారింది

కామేశ్వరి సారధికి అర్ధాంగి అయింది

కొత్త పెళ్ళికూతురుగా ఓపక్క సంతోషం చిందులు వేస్తుంటే, మరోపక్క కన్నవాళ్ళని అయినవాళ్ళని వొదిలి, ఎక్కడో కొత్త చోటికి, కొత్త మనుష్యుల మధ్యకి వెళ్ళిపోతున్న దుఃఖం సుడులు తిరుగుతోంటే గడపబోయే వైవాహిక జీవితపు తీపి ఊహలు ఆ విచారాన్ని కొంత వరకు పోగొట్టాయి

భాగ్యనగరంలో, ఓ ముచ్చటైన రెండు గదుల అద్దె యింట్లో వారి కొత్త కాపురం శ్రీకారం చుట్టుకుంది

* * *

సారధి ఓ ప్రఖ్యాత అండర్‌టేకింగ్‌లో ఉద్యోగి. ఆ ఉద్యోగం లభించినందుకు అందరూ అతని అదృష్టాన్ని పొగుడుతారు. అతని సర్వీసు ఒక సంవత్సరం మాత్రమే. అతనికొచ్చే జీతం తొమ్మిదొందలు. ఏడాదికి

# ప్రతియేటా మీకు రూ. 278 ఆదా—హాకిన్స్ ప్రెషర్ కుక్కర్‌తో ఇంధనం ఖర్చు తగ్గుతుంది

## కొన్నాక ఒక్క సంవత్సరంలో హాకిన్స్ తన ధర తానే చెల్లిస్తుంది

### మీకు కిరసనాయిలు సమస్య తీరిపోతుంది

కిరసనాయిలు దొరకడమూ కష్టం, దాని ధరా ఎక్కువే. అంచేత, సాధ్యమైనంత తక్కువ కిరసనాయిలుతో వంట చేయడానికి అన్ని విధాలుగానూ ప్రయత్నించాలి. ఆధునిక విజ్ఞానం దానికో మార్గం చూపిస్తోంది.

పరీక్ష కోసం, హాకిన్స్ ప్రెషర్ కుక్కర్‌తో శాస్త్రీయంగా వంటచేసి సరిపోల్చి చూడగా, దానివల్ల మామూలు పద్ధతిన వంట చేయడంలో కన్నా సగటున 53% కిరసనాయిలు తగ్గుతుందని ఋజువైంది. కారణం ఏమిటంటే, మామూలు పద్ధతిలో కన్నా హాకిన్స్‌తో అయితే వండటానికి పట్టే కాలం సగానికి పైగా తగ్గిపోతుంది. కిరసనాయిలనే కాదు—గ్యాస్, బొగ్గు, కర్ర, విద్యుచ్ఛక్తి లాంటి ఏ ఇతర ఇంధనమైనా సరే, ఇదే విధంగా ఆదా అవుతుంది.

### అత్యుత్తమ పెట్టుబడి

హాకిన్స్ ఉపయోగించడం వల్ల, ఓ సగటు కుటుంబం రోజుకు అర్ధ లీటరు కంటె ఎక్కువగా కిరసనాయిలు ఆదా చేసుకోవచ్చు. ఒక సంవత్సరంలో, కేవలం ఇంధనం ఖర్చులో ఆదా అయిన దానితోనే హాకిన్స్ తన ధర చెల్లించి వేస్తుంది. ఏళ్ల తరబడి మీకు ఉపయోగ పడేలా రూపొందించ బడింది హాకిన్స్. అంచేత ఇవాళ మీరు దానిమీద చేసే పెట్టుబడి అతి లాభ సాటిదన్నమాట. ఇంతకు ముందెప్పుడూ మీరు ప్రెషర్ కుక్కర్ ఉపయోగించక పోయినా జంక వలసిన పని లేదు. ప్రతీ హాకిన్స్ తోనూ, చేసిచూడబడిన 127 వంటలు గల సరళమైన సచిత్ర బోధనాత్మక పుస్తకం ఒకటి మీకు లభిస్తుంది. ఈ పుస్తకం 12 భారతీయ భాషల్లో లభిస్తోంది




### నిర్వహణ ఖర్చులో ఆదా

హాకిన్స్ ఏమాత్రం ఇబ్బంది కలిగించదు. హాకిన్స్ గాస్కెట్, సేఫ్టీ వాల్వ్ మామూలు రకం ప్రెషర్ కుక్కర్లలోని వాటి కంటె ఎక్కువ కాలం మన్నుతాయి.

ప్రత్యేకమైన నమూనా కారణంగా హాకిన్స్ ప్రమాదం లేనిది. దీని మూతను తెరవాలంటే పక్కవైపు నుంచి కాక పాత్రలోపలికే దానిని దించాలి. అంచేత, లోపలి ఒత్తిడి పూర్తిగా సురక్షితమైన స్థాయికి తగ్గేవరకూ పొరపాటున కూడా మూత తెరవడానికి వీలవదు. సేఫ్టీ వాల్వ్ హేండిల్ బార్ కింద ఉండటం వల్ల అది పనిచేసినప్పుడు ప్రమాదం లేకుండా ఆవిరి కిందికి తిప్పి కొట్టబడుతుంది

### ఉచిత సర్వీసు

హాకిన్స్‌కు వ్రాత పూర్వకమైన ఐదేళ్ల హామీ ఉంది. హామీ ఉన్న విడి భాగాలన్నీ ఉచితంగా మార్చబడతాయి. హాకిన్స్ సర్వీసు ఎల్లప్పుడూ ఉచితమే. ఫ్యాక్టరీ శిక్షణ పొందిన మెకానిక్‌లు గల హాకిన్స్ అధీకృత సర్వీసు కేంద్రాలు భారత దేశంలోని 115 పట్టణాలలో ఉన్నాయి. వీటిలో సత్వరమైన, నిపుణమైన సర్వీసు లభిస్తుంది.

### మీ కుటుంబ ఆరోగ్యానికి పెట్టుబడి చేయండి

మీరే తెలుసుకుంటారు, హాకిన్స్ మీ కుటుంబ ఆరోగ్యానికి కూడా పెట్టుబడే అని. ఎందుకంటే, మామూలు వంటకంటె దీని వంట మరింత ఆరోగ్యకరమైన ఆహారాన్ని సమకూరుస్తుంది. ప్రెషర్ కుక్కర్‌తో వండితే ఆహారంలోని పోషక విలువలు—ముఖ్యంగా విటమినులు, ప్రొటీనులు—మరింత ఎక్కువగా నిలచి ఉంటాయని కేంద్ర ఆహార మరియు సాంకేతిక పరిశోధనా సంస్థ పరిశీలనల వల్ల తేలింది. అంతేకాదు, హాకిన్స్ మీకు మరింతగా పరిశుభ్రమైన ఆహారాన్ని అందిస్తుంది కూడా. ఎందుకంటే, ఇది 122°C ఉష్ణోగ్రతలో వండటం వల్ల ఆహారంలో సూక్ష్మజీవులన్నీ నశిస్తాయి

ఈ రోజుల్లో మీకు హాకిన్స్ ప్రెషర్ కుక్కర్ ఉండి తీరాలి. మీకు దగ్గరలోని తెలిసిన విక్రేత దగ్గరకు వెళ్లి హాకిన్స్‌ను కొనుక్కోండి. లేదా మా యీ చిరునామాకు వ్రాయండి: ప్రెషర్ కుక్కర్స్ & అప్లయన్సెస్ లిమిటెడ్, పి.ఓ. బాక్స్ 1542, బొంబాయి 400 001.




® హాకిన్స్ మరియు హాకిన్స్ యూనివర్సల్ అనేవి రిజిస్టర్డ్ ట్రేడ్‌మార్కులు,
© 1980 కాపిరైట్ యొక్క రిజిస్టర్డ్ వాడకం దారులు ప్రెషర్ కుక్కర్స్ & అప్లయన్సెస్ లిమిటెడ్,

## హాకిన్స్®

## ఏమాత్రం ఇబ్బంది కలిగించకుండా ఏళ్ల తరబడి పనిచేసేలా రూపొందించబడిన ప్రెషర్ కుక్కర్

PCA.157-2516 TL

పద్దెనిమిది వందలదాకా బోనస్ వుంటుంది.

ఈ మధ్యనే ఓ స్కూటర్ కొన్నాడు సారధి ఆఫీసు టైం కాగానే స్కూటరుని యింటికేసి పరుగెత్తిస్తాడు ఓ క్షణం మధ్యలో ఎక్కడా వృధా పోనివ్వడు అతని వయసు, మనసు కామేశ్వరి వెచ్చని కౌగిలి కోసం ఆత్రత పడుతూంటుంది.

ఆఫీసులో పడిన శ్రమనంతా - ఆమె లేపే పెదవుల్ని ముద్దాడుతూ మరిచిపోతాడు.

కామేశ్వరి పరిస్థితీ అంతే. పగలంతా అతని రాకకోసం క్షణాలు లెక్కపెడ్తూ, పొందిన మధురానుభవాలని గుర్తుచేసుకుంటూ కాలక్షేపం చేస్తుంది

ఇలా వారిద్దరూ— ఆకలి, నిద్రలని మరిచి, మనసుని వయసుకి అప్పగించి, కౌగిలికి కళ్ళెం వొదిలి, యధేచ్ఛగా సుఖ సామ్రాజ్యం ఏలుతున్నారు

ఓ శెలవురోజు మధ్యాహ్నం పూట... ప్రణయ లోకాల్లో విహరిస్తున్న సమయంలో—

బయట కాలింగ్ బెల్ మోగింది. అనుభూతి చెరిగింది.

తమ యింటికి వచ్చే అతిధులెవరా!? అని

## మంచి మొగుడు

ఆశ్చర్యపోతూ వెళ్ళి తలుపు తీసింది కామేశ్వరి

ఎదురుగా ఓ అపరిచిత స్త్రీ.. పాతికేళ్ళుంటాయి. మంచి ఆకర్షణీయంగా వుంది ఆమె చేతుల్లో ఓ ఏడాది వయసున్న బాబు

భార్య అక్కడే, అలాగే నిలబడిపోవడంతో, తనూ లేచి ఇవతలికొచ్చాడు సారధి

ఆ స్త్రీని చూడ్డంతోనే అతని ముఖం విప్పారింది "..ఓ మువ్వా ప్రమీలా! రా లోపలికి!" అంటూ అభిమాన పూర్వకంగా ఆహ్వానించేడు కామేశ్వరి పక్కకి తొలగి దారిచ్చింది ఆమె లోపలి కడుగు పెట్టింది.

అయిష్టతని సూచిస్తూ మొహం ముడుచుకుంది కామేశ్వరి ఎవరీమె? భర్తతో ఎలా పరిచయం? ఇప్పుడు తమింటికి ఎందుకోసం వచ్చింది? ఆమెలో ఈ ప్రశ్నలు తలెత్తాయి

సారధి వారిద్దర్ని ఒకరికొకరు పరిచయం చేసాడు

ఆమె ప్రశ్నలు కొన్నింటికి సమాధానాలు దొరికినయి

ఇద్దరూ ఒకే ఆఫీసులో పని చేస్తున్నారట భర్త ఆహ్వానాన్ని పురస్కరించుకునే ఆమె ఇప్పుడు వచ్చిందట

"ఇంత తొందరగా మా ఇల్లు పావనం చేస్తావనుకోలేదు" సమాధానంగా అన్నాడు సారధి, నవ్వుతూ.

"నీ సెలక్షన్ ఎలా వుందో చూడాలనే ఆత్రత" చూపులు కామేశ్వరి మీదకు మళ్ళిస్తూ అంది ప్రమీల

వారిద్దరూ అలా చనువుగా, ఏకవచనంతో మాట్లాడుకోవడం కామేశ్వరికి ఏంతమాత్రం నచ్చలేదు

"ఎలా వుంది?" కుతూహలంగా అడిగేడు సారధి

"కాఫీన్నీ మంచినీళ్ళు కావాలి" అంది, అడిగిందానికి జవాబు చెప్పకుండ కామేశ్వరి ఆ పని మీద వంటింటి కేసి వెళ్ళగానే —
"హండ్రెడ్ పర్సెంట్ ఓ కె" అంది

సారధి కళ్ళు సంతృప్తిగా గర్వంగా చూసాయి కామేశ్వరి మంచినీళ్ళ గ్లాసుతో వచ్చింది

ఆమె గ్లాసందుకోగా, సారధి చొరవగా ఆమె ఒళ్ళోని బాబుని తీసుకున్నాడు. ఆ ప్రయత్నంగానే కామేశ్వరి కళ్ళు వారిద్దర్ని

# భారతి

## సాహిత్య మాసపత్రిక



## నవంబరు

## 1981

## నుంచి

## వెలువడుతోంది



**విడి ప్రతి వెల రు. 4 లు**

మీ కాపీ ముందుగా రిజర్వు చేసుకోండి.

# మంచి మొగుడు

నిశితంగా పరీక్షించేయి అతని చేతులు ఆమెని ఎక్కడైనా తాకుతాయేమోనని వెదికేయి

ఆ బాబు సారధి దగ్గర బాగా మాలిమి అన్నట్టు– హుషారుగా కేరింతలు కొడుతూ, ఆడుకోసాగేడు

సంభాషణ ఎక్కువగా వారిద్దరి మధ్యనే సాగింది

కామేశ్వరి పొడి పొడిగా మాట్లాడింది

ఓ అరగంట కూర్చుని వెళ్ళిపోయింది ప్రమీల ఆమె అలా గడప దాటుతుండగానే, కామేశ్వరి భర్త మీద దాడి చేసింది

"ఆవిడగారు ఎందుకొచ్చినట్టు ?"

"మనని చూసిపోదామని" మామూలు ధోరణిలో జవాబిచ్చేడు సారధి

"అదే ఉద్దేశమైతే దొంగలా ఎందుకు రావాలి ? మొగుణ్ని వెంటబెట్టుకుని రాలేదెందుకని ? ?" స్నీజర్‌లా అడిగింది

సారధికి బాధ కలిగింది తన భార్య దృష్టిలో దొంగ ముద్ర పొందిన ప్రమీల పట్ల జాలి కలిగింది

"ప్రస్తుతం ఆమె భర్తకి దూరంగా వుంటున్నది. ఇద్దరి మధ్య స్పర్ధలొచ్చాయి" అతని కంఠం సానుభూతిగా పలికింది

కామేశ్వరి మొహంలో ఏవో నీడలు కదిలేయి. "ఆమె కొడుకుని అలా ముద్దులాడేరు. ఆ బాబంటే మీ కంత ప్రేమా ?" ఆరాగా అడిగింది

సారధి చిరాగ్గా చూసాడు.

"పసిపిల్లలెవర్ని చూసినా నాకిష్టమే?" చెప్పాడు.

కాని, ఆ సమాధానం ఆమెని కన్విన్స్ చేయలేకపోయింది ఆమె మనసు మూర్ఖంగా ఆలోచిస్తోంది, అది అనుమానపు మంటలతో సలసలా కాగిపోతోంది ఆ వేడిలో ఆమె విచక్షణా జ్ఞానం కోల్పోయింది– సంస్కారం కాలిపోయింది. ఆమె బుర్రలో చీడ పురుగు లాంటి ఆలోచనొకటి కలిగింది.

"భర్తతో కాపురం చేయకుండానే బాబెలా పుట్టాడు మీ ఫ్రెండుకి...?" నిశితంగా చూస్తూ అడిగింది కామేశ్వరి దానికి సమాధానం కూడా ఆ చూపుల్లోనే ఇమిడి వుంది ఈ పుణ్యం కట్టుకుంది నువ్వు కాదా? అనే భావాన్ని వ్యక్తం చేసాయి ఆ చూపులు

భార్య ఇలా అసహ్యంగా ఆలోచించడం

# KERAGEM

కేరాజెమ్ అనేకసార్లు వడకట్టిన అసలైన

## కొబ్బరినూనె

నల్లగా నిగనిగలాడుతూ చిక్కగా
జుట్టు పెరగడానికి

## కేరాజెమ్

శుద్ధమైనది సువాసనతో కూడినది
కొబ్బరినూనెలలో అమూల్యము




కేరళా స్టేట్ కోకోనట్
డెవలప్‌మెంట్ కార్పొరేషన్
లిమిటెడ్
(కేరళా ప్రభుత్వపు సంస్థ)
త్రివేంద్రమ్-695 014(కేరళా)

EP-KSCDC-102-81 Tel

ఆంధ్ర ప్రదేశ్ లో సెల్లింగు ఏజంట్సు : నరసయ్య & కంపెనీ,

| | | |
|---|---|---|
| 3–5–784/6–5 కింగ్‌కోఠి,<br>బషీర్‌బాగ్ రోడ్డు, హైదరాబాదు–1.<br>ఫోన్ నెం. 220782. | 11–22–28 రాజరంగయ్యప్పారావువీధి,<br>విజయవాడ–1, ఫోన్ నెం. 77328. | గంగానమ్మపేట, తెనాలి–1.<br>ఫోన్ : 166.<br>ఏలూరు బజార్, గుంటూరు–3. |

సారధికి బాధ కల్గించింది. ఒక దోషిలా భావించి ఆమె తనని క్రాస్ ఎగ్జామిన్ చేయడం అతనికి నచ్చలేదు.

"చాలా దారుణంగా మాట్లాడుతున్నావ్ కామ్! ఆమె భర్తతో విడిపోయింది రెండు నెలల క్రిందటే..." సారధి సమాధానం విని, ఆమె మౌనంగా వుండిపోయింది అతనూ మాట్లాడలేదు. ఇరువురూ ఎడమొహం, పెడ మొహంగా ప్రచ్ఛన్న యుద్ధం చేసారు

* * *

ఆ సంఘటనతో వారి సంసార జీవితంలో మొదలైన అపశ్రుతికి మరో సంఘటన జత కలిసింది

ఆ రోజు శనివారం—

సాయంత్రం 5-15 ని॥లకి సారధి స్కూటర్ యింటి ముందు ఆగింది. కామేశ్వరి ఎదురువెళ్ళింది. ఆమె అందంగా తయారై వుంది ఆ రోజు వారికి సినిమా ప్రోగ్రాం వుంది. భర్త చేతిలో పాలడబ్బా వుండటం చూసి ఆశ్చర్యపోయింది కామేశ్వరి

"... ఇదెందుకు తెచ్చారు ?.. " అడిగింది. పుట్టబోయే పిల్లల కోసమని ఇప్పట్నుంచే జాగ్రత్తపడుతున్నాడా ఏమిటి? అనిపించిందామెకి.

కాని, అతని సమాధానం మరో రకంగా వచ్చింది.

"ప్రమీల బాబు కోసం! మార్కెట్లో ఎక్కడా దొరకడంలేదు కదా! తెచ్చిపెట్టమని నన్ను అడిగింది."

కామేశ్వరి ముఖం చేదుమాత్ర మింగినట్లుగా మారింది

"అయితే ఆవిడ రేపొస్తుందన్నమాట మనింటికి!" దీర్ఘంతీస్తూ అంది.

"లేదు. రేపు శలవేకదా! నే వెళ్ళి ఇచ్చి వస్తాను" అతని సమాధాం వింటుంటే ఒంటికి కారం రాసినట్లుగా వుంది కామేశ్వరికి

ఆమె పట్ల భర్త చూపిస్తున్న శ్రద్ధాసక్తులకి ఒళ్ళు మండింది కామేశ్వరికి. ఇద్దరి మధ్య ఏదో సంబంధం వుందని రూఢీ చేసుకుంది.

ఆమెకి దుఃఖం వచ్చింది. వీళ్ళిద్దరూ కలిసి తనని దగా చేస్తున్నారనిపించింది. తనని పెళ్ళి చేసుకుని అతను తన గొంతు కోశాడనుకుంది.

తనకి తలనొప్పిగా వుందని అబద్ధమాడింది కామేశ్వరి. అతనెంత బ్రతిమాలినా సినిమాకు రానంది. సారధి కోపంతో టిక్కెట్లు చింపేసి ఎటో వెళ్ళాడు.

* * *

"సుజాతా నర్సింగ్ హోం" ఆవరణ దాటి రోడ్డుమీది కొచ్చింది కామేశ్వరి.

"రిక్షా కావాల్నామ్మా..."

ఎక్కి కూర్చుంది రిక్షా కదిలింది

ఆమెకి చాలా సంతోషంగా వుంది. మనసులో ఓ వింత అనుభూతి కల్గుతోంది.

ఆమె అమ్మ కాబోతోంది

రెండ్రోజుల్నుంచి ఒంట్లో అదోలా వుంటే, పరీక్ష చేయించుకోవడం కోసం వచ్చింది. లేడీ డాక్టర్ కన్‌ఫర్మ్ చేసి చెప్పింది.

సారధికి ఆ సంతోష వార్త చెబితేగాని తన భారం తగ్గదు

అంతులేని సంతోషంలో తేలిపోతూ మెల్లిగా వాస్తవంలోకి వచ్చింది కామేశ్వరి రిక్షా పోతూనే వుందింకా మెయిన్‌రోడ్డు వాహనాలతో రద్దీగా వుంది ఆమె కళ్ళు వీధి చివరి వరకు దృష్టిని సారించేయి.

సరిగ్గా ఆ సమయంలోనే ఓ స్కూటర్ వీధి మలుపు తిరిగి కనుమరుగయింది. ఆ స్కూటర్ తన భర్తదే దాని మీద వున్నది కూడా అతనే. విశేషం అది కాదు

అతన్ని అనుకుని, చేరువగా వెనక సీట్లో ప్రమీల కూర్చుని వుంది.

కామేశ్వరి మనసు విషపూరితం అయిపోయింది. ఆవేశం సెగలు, పొగలు విరజిమ్మింది.

ఇక వారిద్దర్నీ క్షమించి వూరుకోలేకపోయింది ఆమె సహనం హద్దులు దాటింది. అప్పటివరకు ఆమె మనసులోని ఆనందం ఆవిరయిపోయింది భర్త మీద గౌరవం అన్నది లేకుండ, తుడిచి పెట్టుకుపోయింది

నీతి, నియమం లేని ఓ మగవాడి మూలంగా తను గర్భవతి కావడమా ? ఛీ...ఛీ...! అంటూ ఏవగించుకుంది

రిక్షా యిల్లు చేరే లోపు ఆమె ఒక నిర్ణయాని కొచ్చింది.

బట్టలు మడతపెట్టి, సూట్‌కేస్‌లో సరుకుంటున్న కామేశ్వరిని ఆశ్చర్యంగా చూసాడ సారధి.

"ఏమిటిది ?"

"ప్రయాణం" చెప్పింది.

"ఇంత హఠాత్తుగా ?"

"అవును, మళ్ళీ ఇక వచ్చేది లేదు" ఖచ్చితంగా చెప్పింది.

అయోమయం, భయం చుట్టుముట్టాయి సారధిని.

"ఎందుకని ?" గంభీరంగా ప్రశ్నించేడు.

"మీరు కల్పించిన పరిస్థితే. ప్రమీలతో హాయిగా వుండండి" అంది అక్కసుగా.

"ఏమిటా పిచ్చి వాగుడు ?"

"జరుగుతున్న భాగోతమే ! నా కంతా తెలుసు."

అకారణంగా తనని నిందిస్తూ, అర్థరహితంగా మాట్లాడుతున్న భార్యమీద కోపం వచ్చింది సారధికి. పరాయి స్త్రీతో తనకి అక్రమ సంబంధం అంటగట్టి, నేరారోపణ చేసినందుకు ఆగ్రహ పూరితుడయ్యేడు.

కాపురానికొచ్చాక మొదటిసారిగా— భర్త వాగ్ధాటికి కామేశ్వరి నోరు తెరుచుకుని చూస్తుండి పోయింది.

"ఏం తెలుసే నీకు? భర్త ఆఫీసుకి వెళ్ళింది మొదలుకొని, కొంపకి చేరేదాకా వక్రంగా ఆలోచించడం !

పనీ, పాటా లేకుండా యింట్లో వుంటూ దేంతో తిరుగుతున్నాడు, దేనివల్లో పడ్డాడు

## నిరీక్షణ

నా దృష్టి
వెనక్కి మరలి
అంతర్గతమైన — నీ
అందాలను స్పృశిస్తుంది.

నా మనస్సు
పూర్వాశ్రమాన్ని చేరి — ఆ
మధురానుభూతిని
మననం చేసుకుంటుంది.

నా హృదయం
నీ ఆలయమై
నీ దివ్య రూపాన్ని
ప్రతిష్ఠించుకుంటుంది.

నేను — నా సర్వస్వాన్ని
నీకే అర్పిస్తూ
నిన్నే ఆరాధిస్తూ — నీకై
నిరీక్షిస్తున్నాను.

— దొడ్డంకి వెంకట్రావ్

లేక దేంతో ప్రయాణం సాగిస్తున్నాడు– అని ఆరాలు తీయడం...

ఏ వగలాడి ఆకట్టుకుందో, ఏ వయ్యారి లొంగదీసుకుందో అనుమానం...

ఉద్యోగం కోసం బయటివెళ్లే మగవాడి గురించి ఏందుకింత తక్కువగా ఆలోచిస్తారు? మాకేనా అంత కేరెక్టర్ లేంది?

పోనీ పతివ్రతలు మీ ఆడవాళ్లే వను కుందాం! అప్పుడైనా మగవాడు చెడిపోకూడదే!

మీరు అనుమానించేది మీ భర్తల్నికాదు మీ జాతినే. మిమ్మల్ని మీరే అవమానించు కుంటున్నారు...''

---

## మంచి మొగుడు

కామేశ్వరి మొహం కందగడ్డలా అయింది. భర్త చేత ఇన్నిమాటలు అనిపించుకున్నందుకు ఉక్రోషం కలిగింది.

"నిన్న ఆవిడగారితో మీ స్కూటర్ ప్రయాణం నేను కళ్లారా చూసాను" అంది రోషంగా.

సారధి తొట్రుపడలేదు. ప్రశాంతంగా చూసాడు.

"అబద్ధమని నేను అన్నానా! ఆఫీసులో వుండగా ఆమెకి ఫోన్ వచ్చింది— బాబుకి ప్రాణాపాయంగా వుందని. నాకు విషయం తెలిసింది. మానవత్వం వున్న మనిషిగా— వెంటనే ఆమెను బిడ్డ దగ్గరకు చేర్చాను..." వివరించేడు.

కళ్ళు మోసం చేస్తాయని, చూసినప్రతిదీ నిజం కాదని గ్రహించింది కామేశ్వరి. తన తొందరపాటుకి సిగ్గు కలిగింది. ఇంత మంచి మొగుడినా తను అనుమానించింది?

అంతలో "సార్" అని బయట నుండి పిలుపు వినబడ్డది.

వచ్చింది ఆఫీసు అటెండర్, కబురు తెచ్చాడు— ప్రమీల బాబు చనిపోయాడని.

సారధి షాక్ తిన్నాడు. నోటి మాట రాలేదు. ఆ వార్త విని కామేశ్వరి కూడా చలించిపోయింది. అప్పుడే అనుభవంలోకి వస్తున్న మాతృత్వపు మమకారం— గర్భ శోకాన్ని అర్థం చేసుకునేందుకు తోడ్పడింది.

"మనం అక్కడికి వెళ్దాం" భర్తని కోరింది. సారధి అపనమ్మకంగా చూసాడు.

ఆమె దగ్గరకొచ్చి అతని చేతిపందుకుంది. "నన్ను క్షమించండి!" అంటూ చిన్నగా ముద్దు పెట్టుకుంది. అనునయంగా భార్యని దగ్గరకు తీసుకున్నాడు సారధి.

వారు వెళ్ళేసరికి ప్రమీల దుఃఖసాగరంతో వుంది. ఏ తల్లికైనా సహజం ఆ కడుపు కోత.

పిల్లలు పుడితే దంపతుల మధ్య కలతలు కలహాలు వుండవంటారు.

కాని ఇప్పుడందుకు వ్యతిరేకంగా జరిగింది.

అప్పటివరకూ అభిప్రాయ భేదాలతో దూరమైపోయిన ఆ భార్యాభర్తలు కలిసారు.

అతను ప్రమీల కన్నీటిని చేత్తో తుడుస్తూ ఓదారుస్తుంటే సంతోషించకుండా వుండలేక పోయారు— సారధి దంపతులు. ❁





ఆరోగ్యం చిందే పళ్ళు, చిగుళ్ళకోసం నమ్మకంగా వాడబడేది లవంగనూనె.

కొత్త

ఇదిగో

# ప్రామిస్ పళ్ళ పొడి

## అనాదిగా వాడబడుతున్న లవంగనూనెతో కూర్చినది

లవంగనూనెతో కూడిన ప్రామిస్ పళ్ళపొడి మీకెలా తోడ్పడుతుందో చూడండి.

- నోటిలో దుర్వాసనను, దంతక్షయాన్ని కలిగించే క్రిములను తొలగిస్తుంది. మీ నోటిని శుభ్రంగా రూపొందిస్తుంది.
- మీ చిగుళ్ళు ఆరోగ్యం చిందించేలా చేసి అతి మెల్లగా రుద్దుతుంది.
- మీ పళ్ళను తెల్లగా తళతళ లాడేలా చేస్తుంది.
- పిప్పరమెంట్ మరియు లవంగనూనె యొక్క సాటిలేని రుచి.




బల్సారా
—సౌఖ్యమైన జీవనానికి ఆధునాతన సాధనాలు

## కొత్తది. సాటిలేనిది. లవంగనూనె గలది ప్రామిస్ పళ్ళపొడి

CHAITRA-BLS-436 Tel

# హైదరాబాద్ నోట్ బుక్

**— తిరుమల రామచంద్ర**

### ఆదిలోనే హంసపాదు :

అక్టోబరు 20 న బషీర్‌బాగ్ సమీపంలోని అవంతీ నగర్ వద్ద కూచిపూడి ఆర్ట్స్ అకాడమీ భవనం శంఖుస్థాపనకు వచ్చిన వారంతా ఆశ్చర్య పడిపోయి, ఇదేమిటి ఆదిలోనే హంసపాదు అని విచార పడవలసి వచ్చింది పురపాలక శాఖామంత్రి శ్రీమతి సరోజినీ పుల్లారెడ్డి శంకుస్థాపకులు, సాంస్కృతిక శాఖామంత్రి శ్రీ భాట్టం శ్రీరామమూర్తి ముఖ్య అతిథి శ్రీమతి పుల్లారెడ్డి శంఖుస్థాపన శిలా ఫలకాన్ని స్థాపించకుండానే వెళ్లిపోవలసి వచ్చింది కూచిపూడి అకాడెమీ భవనం నివేశన స్థలం విషయంలో స్థానికులు పేచీ పెట్టారు ఈ స్థలాన్ని పార్కు కోసం కేటాయించారని, కనుక భవన నిర్మాణం తగదని స్థానికులు శ్రీమతి పుల్లారెడ్డికి విన్నవించారు. అకాడమీ భవన నిర్మాణం స్థానికులకు లాభదాయకమని, కనుక సామరస్యంతో సమస్యను పరిష్కరించుకోవలసిందని మంత్రిణి ఎంత చెప్పినా స్థానికులు వినలేదు ఈ స్థలం 2500 గజాల విశాలమని, కొంత భాగం పార్కుకూ వుంటుందని ఆమె ఎంత చెప్పినా, స్థానికులు పెడచెవిని పెట్టారు కూచిపూడి అకాడమీ ప్రిన్సిపాలు కుమారి శోభానాయుడు తమ ప్రసంగంలో పురపాలక శాఖ ప్రభుత్వ అనుమతితోనే తమకు స్థలం మంజూరు చేసిందని అన్నారు. మరి ఈ వివాదం ఎలాఉత్పన్నమయిందో తెలీలేదు.

### శ్రీ నాయని సుబ్బారావు సంస్మరణం :

ఆలంకారికులు విరచించిన ప్రియ నాయికా నిష్ఠ పరమోదాత్త తృతీయ పురుషార్థానికి మరింత ఆపలినత్వం అలంకరించి వేదనాంశం వేదనతోనే కవితతో కంటమెత్తిన కవితల్లజాలు శ్రీ నాయని సుబ్బారావును ఆయన 83 వ జయంతి సందర్భంగా పలువురు వక్తలు సంస్మరించి, సహృదయులతో సంస్కరింపజేశారు కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయంలో అక్టోబరు 22 న జరిగిన జయంత్యుత్సవానికి అధ్యక్షత వహించిన ఆస్థాన కవి డాక్టర్ దాశరథి కృష్ణమాచార్యులు నాయని వారిది "చక్కని బ్రహ్మాండమైనటువంటియొక్క కవిత" అన్నారు నాయని వారు తనను "కవితా పుష్పక దాశరథి" అని ఆదరించేవారని అన్నారు. నాయని వారి చిత్రపటం ఆవిష్కరించిన వ్యాయామశాఖామాత్యులు శ్రీ ఇ. అయ్యపురెడ్డి ప్రసంగిస్తూ నాయనివారు పనిగట్టుకుని కవిత చెప్పలేదు. హృదయం కదిలితేనే ఆయన కలం కదిలింది. తుదు ఖమే స్వర్గలోక దారిద్ర్యంతో అన్నట్లు ఆత్మశ్రమ కవితను స్వయం భావిష్కరణంగా గాక, సర్వజనీనం చేయుడానికి సంవేదన బలం వుండాల అలాటి సంవేదన నాయనివారి కవితలో తొణికిసలాడుతున్నది. నేను చిత్రపటావిష్కరణ జరుపగలనేకాని, కావ్యపటావిష్కరణ చేయజాలనుఅన్నారు. "నాయని జీవితం—కృతులు" అనే అంశం పై డాక్టర్ భూమయ్య రచించిన సిద్ధాంత వ్యాసాన్ని డాక్టర్ బి రామరాజు ఆవిష్కరిస్తూ, నాయని వారి కవిత శిరీషగా అర్థమయినా, మళ్లీమళ్లీ చదువ వలసివుంటుందని అన్నారు. కాకతీయ విశ్వవిద్యాలయం తెలుగుశాఖాధ్యక్షులు డాక్టర్ కె వి. రామకోటి శాస్త్రి కవి ప్రశంస చేస్తూ నాయనివారి రచనలను దేశకాల పాత్రల వాతావరణంలో పరిశీలించాలని, ఆయన గ్రామీణ జీవితంలో తాదాత్మ్యం పొందినారని అంటూ ఒక పొల్లు మాట లేకుండా ప్రసంగించారు. హైదరాబాద్ విశ్వవిద్యాలయం తెలుగు శాఖ రీడరు డాక్టర్ జి వి. సుబ్రహ్మణ్యం డాక్టర భూమయ్య సిద్ధాంత వ్యాసం పై ప్రసంగిస్తూ, నాయనివారు జీవితానికి ,రచనకు సంబంధం గల వారని, డాక్టర భూమయ్య సిద్ధాంత వ్యాసం కవియొక్క సాహిత్య వ్యక్తిత్వాన్ని సమగ్రంగా చర్చించి శాస్త్రీయంగా విశ్లేషించి అనుశీలించిన ప్రయత్నంలో చక్కని ప్రయోగమని అన్నారు. డాక్టర్ సంపత్కుమార, డాక్టర్ సుప్రసన్నాచార్య ఆశీర్వాదం తర్వాత డాక్టర భూమయ్య కృతజ్ఞత తెలిపారు సభ ప్రారంభంలో భాషా నిలయం ప్రధాన కార్యదర్శి శ్రీ ఎం. ఎల్ నరసింహారావు స్వాగతం చెప్పారు. శ్రీ అక్కిరాజు జనార్ధన రావు వందన సమర్పణ చేశారు.

### శ్రీ జలగం వెంగళరావు రాజీనామా :

రాష్ట్ర మాజీ ముఖ్యమంత్రి, కాంగ్రెస్ ఎస్. నాయకుడు శ్రీ జలగం వెంగళరావు కాంగ్రెస్(ఎస్) పార్టీ నుంచి వైదొలగారు. ప్రాథమిక సభ్యత్వానికి గూడ రాజీనామా యిచ్చారు దేశం ఎదుర్కొంటున్న సమస్యలను రాజకీయ పక్షాలు పరిష్కరించలేక పరస్పరం కలహిస్తూ, స్వార్థంతో ప్రవర్తిస్తున్నాయని ఆయన అక్టోబర్ 23న పత్రికా ప్రతినిధుల సమావేశంలో అంటూ, కాంగ్రెస్ (ఎస్) అధ్యక్షుడు శ్రీ శరద్ పవార్ కు తాను వ్రాసిన లేఖను ప్రకటించడం లేదు భావి కార్యక్రమాన్ని ఆయన వివరించలేదు "శ్రీ అంజయ్య, శ్రీమతిగాంధి నాయకత్వం పదిలంగ వుండాలని ఏడుకొండల వాడిని ప్రార్థిస్తున్నారు. శ్రీ అంజయ్య పదవీకాలంపూర్తిగా కొనసాగాలని నేను ఏడుకొండల వాడిని వేడుకుంటున్నాను" అని ఆయన చలోక్తి విసిరారు.

### ఉపశ్రుతి

ఏ ఉండాయి! కాంగ్రెస్ ఎంఎల్ఏలలో ఏ పదవి కైనా ప్రయత్నించక పోయారా? అనడిగాను ఒక వృద్ధ స్వాతంత్ర్య యోధుణ్ని బతే ప్రశ్నవేశారు ద్వితీయ యుద్ధ సమయంలో బ్రిటిష్ ప్రభుత్వానికి బరాబరులు చేసిన వారు, ప్రాసిక్యూషన్ తరఫున సాక్షులైన వారు అగ్ర పదవుల్లో వుండగా ఏమని అడగను?— అన్నారు ఆయన.

# చివరి పాఠం



శ్రీ కల్లాన మోహనబాబు

ఎదురుగా 'ఆపరేషన్ థియేటర్' గోడమీది ఎరటి బల్బు వెలుగుతోంది. దాన్నే చూస్తూ మాటి మాటికీ చేతికున్న రిస్టు వాచీని గమనిస్తూ, అసహనంగా, ఆందోళనగా అక్కడున్న బెంచీమీద కూర్చున్నాడు ఆనందరావు లోపల తన భార్య కమలకి 'సిజేరియన్ ఆపరేషన్' జరుగుతోంది. పెళ్ళయిన పదిహేనేళ్ళకి తను మొదటిసారిగా తండ్రి కాబోతున్న క్షణాలివి కాని ఆనందరావు పుట్టబోయే బిడ్డ కోసం ఆలోచించడం లేదు 'స్ట్రెచర్ మీంచి ఆపరేషన్ థియేటర్'లోనికి వెళ్తూ తనవేపు దీనంగాచూసిన కమల చూపులే అతని కళ్ళముందు కదులుతూ కలవర పెడుతున్నాయి. ఈ పదిహేనేళ్ళ వైవాహిక జీవితంలో యిద్దరూ కష్టసుఖాల్ని కలిసి పంచుకున్నారు ఒకరి నొకరు అర్థం చేసికున్నారు ఒకరి కోసం ఒకరై జీవించారు. తనకి చెప్పుకోదగ్గ ఆర్థిక సమస్యలేవీ లేవు. 'లెక్చరర్'గా సంఘంలో ఓ మంచి స్థానం వుంది మంచి వ్యక్తిగా గౌరవం పలుకుబడి వున్నాయి. ఇన్నాళ్ళు తమని వేధిస్తున్నసమస్య కేవలం 'పిల్లలులేకపోవడమే!' అది కూడా యిప్పుడు తొలగిపోతోంది. 'తొమ్మిది నెలలుగా 'ఎప్పుడెప్పుడా' అని ఎదురు చూస్తున్న క్షణాలు రానే వచ్చాయి. తల్లి అనిపించుకునే ఆ క్షణాలు కమల కడుపునికోస్తున్నాయి!

ఈ ఆపరేషన్ సరిగ్గా జరగకపోతే?

తన కమల కేమయినా జరిగితే?

తన భార్య తనకి దూరమైపోతే?

ఓహ! నో!! అలాంటి ప్రశ్నలకి కనీసం ఊహలో నైనా తావులేదు తన కమల తన కెప్పుడూ దూరం కాదు. తాను యెవ్వరికీ యింత వరకూ అన్యాయం చేయలేదు. అంచేత ఆ భగవంతుడు తన కన్యాయం చెయ్యడు! మళ్ళీ వాచీ చూశాడు కంగారుగా! అరగంటకి పైగా అయ్యింది ఆపరేషన్ ప్రారంభమయి! తన నుదిటిమీద చమట బిందువులు జారి ప్యాంటుమీద పడ్డాయి జేబులోంచి రుమాలు తీసి ఓసారి ముఖం అంతా తుడిచాడు ఆ గోడమీద ఎర్రటి బల్బు ఆరిపోయింది. సడన్‌గా తను కూర్చున్న బెంచీ మీంచి లేచాడు ఆనందరావు. డాక్టర్లు ఒక్కొక్కరే బయట కొస్తున్నారు డాక్టర్ వసుంధరగారూ బయటికొచ్చింది వస్తూనే ''కంగ్రాట్స్, మగబిడ్డ'' అనేసి తన డ్యూటీ రూమ్‌కేసి వెళ్ళిపోయింది ఆనందరావు హృదయం ఒక్కసారిగా ఉప్పొంగిపోయింది! ''థాంక్ గాడ్'' అనుకున్నాడు ఎంతో సంతృప్తిగా!

ఇంతలో ఆయా ఆ పసికందుని తీసుకుని బయటకొచ్చింది ఆమె చేతుల్లోని 'తన బిడ్డ'ని తనివితీరా చూశాడు ఆనందరావు. ''జీవితాంతం చూద్దురుగానిలెండి ముందు స్నానం చెయ్యనివ్వండి'' అంది ఆయా.

''ఆ 'ఫార్మాలిటీస్' అయిన తరువాత నాకు కనిపించు'' అన్నాడు ఆనందరావు, తను యివ్వదలచుకున్నదిసొ నవ్వు అర్థాన్ని ధ్వనింపజేస్తూ

''అది మీరు చెప్పకపోయినా మేము కలవక మానం'' అనేసి నవ్వుకుంటూ వెళిపోయింది ఆయా

'స్ట్రెచర్' మీంచి కమలని బయటకు తీసికొచ్చి 'గైనిక్ వార్డు'లోని 'స్పెషల్ రూమ్స్' వేపు తీసికెళ్తున్నారు. అలా కమలని చూసిన ఆనందరావుకి అంత సంతోష సమయంలో కూడా ఏడుపొచ్చి రెండు కన్నీటి చుక్కలు రాలి షర్టుమీద పడ్డాయి. నెమ్మదిగా నడుచుకుంటూ స్పెషల్ రూమ్స్ వేపు వెళ్ళాడు.

మరో రెండు గంటల తర్వాత కమలకి తెలివొచ్చింది తన బాబుని తనివితీరా చూసుకుంది.

''మన బాబెలా ఉన్నాడు?'' అడిగాడు ఆనందరావు

ఆమె నవ్వింది నీరసంగా. ఆపరేషన్ మత్తు పూర్తిగా వదల్లేదింకా అంచేత మాట స్పష్టంగా రావటం లేదామెకు.

తరువాత డాక్టర్ వసుంధరని కలవడానికి డ్యూటీ రూమ్‌కి వెళ్ళాడు ఆనందరావు

ఆమె అక్కడ కాఫీ తాగుతూ కనిపించింది.

''రండి కూర్చోండి'' అంది ఆనందరావుని చూసి

''థాంక్యూ డాక్టర్ మీ మేలు యీ జన్మకి మరవలేను. కమలకి తల్లిగా పునర్జన్మ

విచ్చారు ఇన్నాళ్ళు ఆమె పడిన ఆవేదనని ఈ ఆపరేషన్‌తో పటాపంచలు చేశారు. ఐయామ్ రియల్లీ గ్రేట్‌ఫుల్ టు యూ డాక్టర్!'' అన్నాడు ఆనందరావు ఆవేశంగా!

''ఇందులో నేను చేసిందేమీ పెద్దగా లేదు. దిసీజ్ మై డ్యూటీ! పైగా నేనేదో ఊరికే చేశాననుకోకండి. సాయంత్రం మీరు మా యింటి కొచ్చి ఓ ఐదు వందలివ్వాల్సి ఉంటుంది'' అంది డాక్టర్ వసుంధర మామూలుగా.

అదిరిపడ్డాడు ఆనందరావు.

''అయిదు వందలా?'' అన్నాడు నోరు తెరిచి.

''ఏం? అంత కంగారు పడ్డారు? మీ ఆవిడ ప్రాణం ఖరీదు కనీసం అయిదువందలు చెయ్యదా?'' అంది కనుబొమ్మలు చిట్లించి వసుంధర.

''ప్రస్తుతం మూడువందలే ఉన్నాయి. మిగతాది మా ఊరెళ్ళిన తరువాత పంపిస్తాను'' అన్నాడు ఆనందరావు ప్రాధేయపడుతున్నట్టు.





## చివరిపాఠం

''నథింగ్ డూయింగ్! నా వృత్తి నేర్పిన 'మొదటి పాఠం' యిలాంటి కథలు నమ్మకూడదని! అంచేత మీరు సాయంత్రం మా యింటి కొచ్చి ఆ డబ్బివ్వాల్సిందే! దాన్ని గురించి అట్టే యిక్కడ మాట్లాడను బావుండదు'' అనేసి విసురుగా వెళ్ళిపోయింది వసుంధర.

అంతవరకూ దేవతలా ఊహించుకున్న వసుంధర ఒక్కసారిగా రాక్షసిలా కనపడింది ఆనందరావు కళ్ళకి. ఆమె మీద 'గౌరవం' స్థానంలో 'అసహ్యం' చోటు చేసుకుంది.

ఆ సాయంత్రం బజార్లో తన చేతికున్న రెండు ఉంగరాలూ అమ్మేసి అందులోని అయిదువందలు తీసికెళ్ళి ఆమె కిచ్చాడు ఆనందరావు.

ఆ డబ్బు ఆమె కిస్తూ తన మనసులో పొంగుతున్న కోపాన్ని ఆపుకోలేక పోయాడు.

''డాక్టర్. మీరు నాకు చేసిన సహాయానికి చాలా థ్యాంక్స్! మీ కెంత డబ్బిచ్చినా మీ ఋణం తీరదు కాని 'మానవతా ధర్మాన్ని' మీ జీవితంలో అప్పుడప్పుడైనా గుర్తు తెచ్చుకోండి. అందరూ నాలా మీరడిగినంతా యివ్వలేరు అందరికీ నాలా రెండేసి ఉంగరాలు ఉండవు!'' అనేసి విసురుగా బయట కొచ్చేశాడు ఆనందరావు.

ఆ మర్నాడు డాక్టర్ వసుంధర మామూలుగానే వచ్చి కమలని పలకరించింది. ఆనందరావు మాత్రం ఆమెతో ముభావంగానే ఉన్నాడు. కాని అనవసరంగా నోరుజారేనేమో నని మనసులో దిగులుగానే ఉంది. అందుకే కమలని 'డిశ్చార్జి' చేసిన రోజు మళ్ళీ వసుంధరని కలసి క్షమాపణలు చెప్పాడు.

''డాక్టర్, ఆ రోజు మిమ్మల్ని బాధపెట్టి ఉంటే నన్ను క్షమించండి'' అన్నాడు ప్రాధేయపడుతూ.

''ఫర్వాలేదు. అలాంటి దూషణలూ, ఛీత్కారాలూ నవ్వుతూ స్వీకరించడం మా వృత్తి నేర్పిన 'రెండవ పాఠం!''' అంది వసుంధర నవ్వుతూ.

ఆనందరావు కమలనీ, కొడుకునీ తీసుకుని తన ఊరు వచ్చేశాడు. ఓ వారం రోజుల తరువాత తన పేరుమీద ఓ అయిదు వందలు మనిఆర్డరూ, ఓ కవరూ వచ్చాయి. ఆ డబ్బు డాక్టర్ వసుంధర పంపింది! ఆశ్చర్యంగా కవరు చింపాడు ఆనందరావు.

మాస్టారికి నమస్కారములు—

నేను పంపిన 'మనీ ఆర్డరు' కూడా అందుతుంది అనుకుంటాను. మీరు ఆశ్చర్యపోతారని నాకు తెలుసు. నేను రాయబోయే కొన్ని విషయాలు చదివితే మీరు మరింత ఆశ్చర్యపోతారు! అంచేత ఈ ఉత్తరాన్ని కొంతం సావధానంగా చదవండి -

నేను పన్నెండేళ్ళ క్రితం మీ స్టూడెంటుని. మీ కాలేజీలోనే 'బైపీ గ్రూప్'లో ఇంటరు' చదివాను మీ దగ్గర 'ట్యూషన్' కూడా చదివాను. నాతోపాటు చాలామంది అమ్మాయిలూ, అబ్బాయిలూ మీ దగ్గర ట్యూషన్ చదివేవారు. నాలాంటి వారిని కొన్ని వేల మందిని మీ సర్వీస్‌లో చూసి ఉంటారు. అందుకే మీరు నన్ను గుర్తించలేకపోయారు!

ఆ రోజు మిమ్మల్ని బాధ పెట్టి మీ దగ్గర బలవంతంగా అయిదు వందలూ వసూలు చేసినందుకు మిమ్మల్ని మనస్ఫూర్తిగా క్షమార్పణ కోరుకుంటున్నాను. నేనలా ప్రవర్తించడానికి కూడా ఓ కారణముంది. అది ఇక్కడ చెప్పడం నా ధర్మం!

ఆ రోజుల్లో - అంటే నేను మీ దగ్గర ట్యూషను చదివిన తరువాత - మీరు పరీక్షల ముందు 'కోర్సు' పూర్తిచేసి నేను మీకివ్వవలసిన ట్యూషన్ ఫీజు - నూటవిభై రూపాయలు అడిగారు. నిజానికి నా దగ్గర అంత డబ్బు అప్పుడు లేదు. నాన్నగారు పోయి అప్పటికే అయిదేళ్ళయింది. మా మేనమామ యింట్లో ఉండి చదువుకునే దాన్ని మా ఆస్తి అంతా కోర్టు వ్యవహారాల్లో చిక్కుకుని ఉంది. మొదట్లో డబ్బిస్తానన్న మేనమామ తరువాత మొండిచెయ్యి చూపించాడు. అందుకే మీరడిగిన వెంటనే ఆ డబ్బు యివ్వలేకపోయాను కాని మీరు నన్ను అపార్థం చేసుకున్నారు. ఓ రోజు నన్ను మీరు కాలేజీలో మీ డిపార్ట్‌మెంట్‌కి పిలిచి ఆ డబ్బు గురించి నన్ను గట్టిగా అడిగారు. నేను నా పరిస్థితి చెప్పబోతే - ''ఇలాంటి కథలు నేను చాలా విన్నాను. మా వృత్తి మాకు చెప్పే 'మొదటి పాఠం' ఏమిటంటే విద్యార్థులు చెప్పే యిలాంటి కట్టు కథలు నమ్మకూడదని' అంటూ నన్ను అవహేళన చేసి అవమానించారు.

# పనీర్ ఆమ్లెట్

కావలసిన సామగ్రి: రెండు గ్రుడ్లు, 90 గ్రా.ల పనీర్, 20 గ్రాల క్షీరవుల్లి, 20 గ్రాల టమాటాలు, 2 పచ్చిమిరపకాయలు, 25 గ్రాల మైదా, 30 గ్రాల వెన్న, 50 గ్రాల పెరుగుపైనున్న నీళ్ళు, రుచికి కొద్దిగా ఉప్పు, నల్ల మిరియాలపొడి కావలెను

తయారు చేయు విధానం : ఉల్లి, టమాటా, మిరపకాయల ముక్కలు తరిగి ఉంచాలి తర్వాత గుడ్లు కొట్టి పనీర్ని మిశ్రమం చేయాలి వెన్న తప్ప మిగతా అన్ని వస్తువులని కలిపి బాగా గిలక్కొట్టాలి పెనం వేడెక్కిన తర్వాత దానికి వెన్న కొద్దిగా రాసి ఈ గిలక్కొట్టిన మిశ్రమాన్ని గరిటెడు అటు వరే పల్చగా పోసి రెండు వైపులా ఎర్రగా కాల్చాలి

వేడిగా వడ్డించుకుంటే చాలా బాగుంటుంది

— ఎల్. వి. ఉమ

# ఎగ్ మసాలా

కావలసినవి. గ్రుడ్లు – 4, బియ్యం – 2 గ్లాసులు, ధనియాలు – 1 స్పూను, గసగసాలు – 1 స్పూను, వెల్లుల్లి 4 లేక 6 గడ్డలు, దాల్చిన చెక్క కొద్దిగా, లవంగాలు – 7, ఉల్లి – పెద్దవి 3, టమాటాలు – 200 గ్రా., పొదీనా – 1 కట్ట, కరివేపాకు – కొద్దిగా, నెయ్యి లేక




డాల్డా – పావు కేజి, ఉప్పు—సరిపడినంత.

చేయుపద్ధతి. స్టౌమీద వెడల్పాటిగిన్నెవుంచి డాల్డా వేయాలి ఉడికించిన గుడ్లు అందులో వేసి దోరగా వేయించాలి గ్రుడ్ని కోయరాదు. తరువాత ఉల్లి, టమాటా వేసి కాస్త వేయించాక 4 గ్లాసుల నీళ్ళు పోయాలి. బియ్యం బాగుచేసి కడిగి అందులో వేయాలి. పుదీనా, కొత్తిమీర, కరివేపాకు వేయాలి కాస్త పచ్చికారం, ఉప్పు కూడా వేయాలి, ఈలోగా మసాలాను వేరొక పాత్రలో నూనె వేసి బాగా వేయించాలి అన్నం మధ్య రకంగా ఉడికాక, ఈ మసాలా వేసి కలియబెట్టి, సన్నని సెగమీద ఉంచాలి పసుపు వాడరాదు. తరువాత నీరన్నీ ఇంకి అన్నం బాగా పొడి పొడిగా అయ్యాక పెద్ద వెడల్పాటి పాత్రలో గుమ్మరించి, టమాటాలు, ఉల్లి గుండ్రంగా తరిగి, పైన అందంగా అమర్చాలి పెరుగును పోపువేసి ఇందులో తింటే బావుంటుంది. గ్రుడ్లు సన్నగా తరిగి [పొడవుగా]వడ్డించాలి. చాలా రుచిగా వుంటుంది. చేయడం సులభం. పై చెప్పిన కొలతలో అయితే ముగ్గురికి సరిపోతుంది.

— శ్రీరామ శశికళ

# స్వీట్ బ్రెడ్ టోస్ట్

కావలసినవి. ఆరు బ్రెడ్ స్లైసులు, ఒక గ్లాసు పంచదార, కొద్దిగా ఏలకు పొడి.

చేయు విధము పంచదారతో కొద్దిగానీరు పోసి ముదురు తీగపాకం రానివ్వాలి యాలకు పొడి వేసి కిందికి దించిపెట్టుకోవాలి. బాణలిలో నూనెవేసి బ్రెడ్‌లని మనకి కావలసిన ఆకారంలో కోసి దోరగా వేయించి పాకంలో వేయాలి ఇవి చల్లారాక తింటే బాగుంటాయి సెయంత్రం టిఫినుకి ఇవి చేసుకోవచ్చు

— నాగంటి రాణి

# పనసకాయ పెరుగుచెట్నీ

కావలసినవి పావుకిలో సన్నని పనస పొట్టు, పావుశేరు పెరుగు, కొత్తిమిరికట్ట, టీస్పూను ఆవాలు, ఇంగువ, కొంచెం మెంతులు, ఎండుమిర్చి 4, పచ్చిమిర్చి 10, చిటికెడు పసుపు గుండ, తగినంత ఉప్పు

తయారుచేయు విధానము పనసపొట్టు కడిగి, మెత్తగా ఉడకబెట్టి నీరు వార్చాలి బాగా చల్లారిన తరువాత పెరుగులో ఉప్పు, కొత్తిమీర, పచ్చిమిర్చి, కొంచెం ఆవాలు వేసి, మెత్తగా నూరి కలపాలి తరువాత దానికి ఆవాలు, మెంతులు, ఇంగువ, ఎండుమిర్చి, పోపుపెట్టి పనసపొట్టులో కలపాలి ఈ పెరుగు చెట్నీ టిఫిన్‌లోకి, అన్నంలోకి ఆధరువుగాను, రుచిగాను వుంటుంది

— రమణా ప్రకాష్

ఆ రోజే నేను నా గొలుసు బజార్లో అమ్మి మీ డబ్బు మీకిచ్చాను. ఆ తరువాతనేను పట్టుదలతో చదవడం — ఇంటర్‌లో క్లాసు రావడం— మెడిసిన్‌లో జాయివవడం— యీ లోగా మా ఆస్తి కోర్టు ద్వారా మాకు రావడం — చాలా జరిగిపోయాయి!

ఆ రోజే నేను డబ్బు విలువ తెలుసుకున్నాను అందుకే మీ దగ్గరలా ప్రవర్తించాను కాని మీరు కూడా మీ ఉంగరాలమ్మి నాకాడబ్బు యిచ్చారని విని నేనెంతో కుమిలి పోయాను. నేను డాక్టరవడానికి పరోక్షంగా మీరూ కారకులే. మీ దగ్గరే డబ్బు తీసుకోవడం — 'తిన్న యింటి వాసాలు లెక్కపెట్టడం' లాంటిది! అందుకే ఆ డబ్బు తిరిగి తిప్పి పంపుతున్నాను. ఇది నా వృత్తి నేర్పిన 'చివరి పాఠం!'

మరొక్క విషయం — ప్రతి వ్యక్తికీ కొన్ని కాలుష్యాలుంటాయి! విజానికి ట్యూషన్ చెప్పడం చట్టవిరుద్ధం! అయినా మీరు చెప్తున్నారు. ఎందుచేత? విద్యార్థులు కూడా దానివల్ల అదనంగా ప్రయోజనం పొందుతున్నారు కాబట్టి. డాక్టర్లు కూడా డబ్బు తీసుకోవడం తప్పే! అయినా తీసుకుంటున్నారు ఎందుచేత? దానివల్ల రోగులక్కూడా కొంత ప్రయోజనం కలుగుతోంది అలాగని నేను దీన్ని సమర్థిస్తున్నాననుకోకండి! ఆ రోజు మీరు నన్ను "మానవతా ధర్మం" అప్పుడప్పుడయినా గుర్తుంచుకో'' మన్నారు అది మాకెప్పుడూ గుర్తుంటుంది ప్రతి సిత్రలో నుంచి, చెడూ రెండూ ఉంటాయి చెడును పట్టుకుని విమర్శించ కూడదు! మంచిని విస్మరించ కూడదు అయినా యివన్నీ మీరు నేర్పిన పాఠాలే! కొత్తగా మీకు నేను చెప్పగల అనుభవం నాకు లేదు!

మరి ఉంటాను మీ శ్రీమతి బాబాకి క్షేమ మనుకొంటాను నన్ను క్షమించమని కోరుతూ, మని ఆర్డరు తిప్పి పంపొద్దని మరీ మరీ ప్రార్థిస్తూ —

మీ శిష్యురాలు,

— వసుంధర

# అవీ-ఇవీ-అన్నీ

## ధర్మపథం

ఆంధ్ర పత్రిక వారపత్రికలో అన్ని తరాలవారికీ ఆసక్తిని, ఆనందాన్నీ కల్గిస్తున్న 'ధర్మపథం' శీర్షిక క్రింద ప్రచురితమైన 111 (నూట పదకొండు) వ్యాసాలని, తిరుమల తిరుపతి దేవస్థానం వారి ద్రవ్య సహాయంతో, రచయిత శ్రీ బులుసు వేంకట రమణయ్యగారు పుస్తకంగా వెలువరించి, తిరుపతి వేంకటేశ్వరస్వామికే అంకితం ఇచ్చారు. 272 పేజీలున్న ఈ పుస్తకం వెల 15 రూపాయలు. ప్రతులకు రచయిత పేర 34, సెకెండ్ స్ట్రీట్, పురుషోత్తం నగర్, క్రోమ్‌పేట, మదరాసు— 44 లేక బాల సరస్వతీ బుక్‌డిపో, 4, నుంకు రామచెట్టి వీధి, మదరాసు—1కి గాని రాయవచ్చు.



మూడవ ఉత్తర అమెరికా తెలుగు సభలకి రెండవసారి అహ్వానితులుగావెళ్లి నాలుగు నెలల పాటు అమెరికా, ఇంగ్లాండ్ దేశాలలో పర్యటించి పలుచోట్ల హరికథలని గానంచేసి అక్కడి తెలుగు వారి ప్రశంస అందుకుని యిటీవలే స్వదేశానికి తిరిగివచ్చిన శ్రీ వీరగంధం వెంకట సుబ్బారావు.

## స్పృహ

స్పందన సాహితీ సమాఖ్య 28వ ప్రచురణగా వెలువడిన ఈ కథా సంపుటిలో ప్రముఖ రచయిత శ్రీ విహారి రాసిన తొమ్మిది కథలు ఉన్నాయి. 104 పేజీలుగల ఈ పుస్తకం వెల 5 రూపాయలు. ప్రతులకు : స్పందన సాహితీ సమాఖ్య, బుట్టాయి పేట, మచిలీపట్నం.

## తెలుగు తెమ్మెరలు

వ్యాస సంపుటి రచన. ఆచార్య తిరుమల, 8 పేజీలు, వెల 6 రూపాయలు. ప్రతులకు· రచం· పేర, చైతన్య కళాశాల, సుల్తాన్‌బజార్, హైదరాబాద్ లేక శ్రీదేవి నిలయం, 1—9—285 రాంనగర్ గుండు, హైదరాబాద్—44.

## రుక్మిణీ కళ్యాణం

పురాణము, రచన: "దిట్టకవి" 56 పేజీలు, వెల: 3 రూపాయలు. ప్రతులకు రచయిత పేర వాసవీ కన్యకాపరమేశ్వరిదేవాలయము, పిడుగురాళ్ల 522413కి రాయాలి.

## సినీ జనత

ప్రాంతీయ తెలుగు దిన పత్రిక 'జనత' నిర్వాహకులు తెలుగు టాకీ స్వర్ణోత్సవాల సందర్భంగా వెలువరించిన ప్రత్యేకసంచిక 'సినీ జనత' మా కార్యాలయం చేరింది. ఇందులో సినీ పరిశ్రమకి సంబంధించిన పలువురు ప్రముఖుల రచనలు, ఫోటోలు ఉన్నాయి. 16 పేజీలు వెల: 75 పైసలు. ప్రతులకు: జనత, దుర్గాపురం, విజయవాడ—2.

## దిక్సూచి

సిరిసిల్లసాహితీ మిత్రులనిర్వహణలో వెలువడిన సాహిత్య కరపత్రిక రెండవ సంచిక (సెప్టెంబరు, అక్టోబరు 1981) మా కార్యాలయం చేరింది. 8 పేజీలుగలఈ పుస్తకంలో గాయపడ్డ ఉదయం కవితా శీర్షికన్నై శ్రీయుతులు నగ్నముని, దేవరాజు మహారాజు, ఎం.ఎస్. ల కవితలు ఉన్నాయి. వెల తెలియదు, ప్రతులకు : దిక్సూచి, ఇం. నెం.1—2—63, సిరిసిల్ల—505301.


**Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna**